# వృషనామ సంవత్సర — కార్తీక - మార్గశీర్ష మాసములు

1941-వ సం॥ నవంబరు నెల

| | | |
|---|---|---|
| 1 | శ | త్ర రా2.31 ఉభా సా4.56 తెవ5.52ల ఉదు7.30వ |
| 2 | ఆ | చ రా3.53 రే రా6.42 ఉశేవ7.32వ సాదు3.52ల |
| 3 | సో | ○ పూర్ణి రా5.41 అశ్వ రా8.49 మవ4.28ల6.12వ పదు12.4 తిరిగి దు2.21ల |
| 4 | మం | బ॥పా పూర్తి భర రా11.16 ఉశేవ7.25ల9.11వ ఉదు6.16 రాదు10.30ల |
| 5 | బు | బ॥పా ఉ7.44 కృ రా1.52 మవ12.34ల2.20వ దినం 28.23 పదు11.19ల |
| 6 | గు | వి ఉ9.52 రో తె4.30 రావ8.17ల10.3వ ఉదు9.49 తిరిగి దు2.21ల |
| 7 | శు | త ప11.59 మృ పూర్తి పవ10.41ల12.27వ చవితీతిథి ఉదు8.1 తిరిగి దు12.4 |
| 8 | శ | చ మ1.50 మృ ఉ6.52 మవ4.0ల5.44వ శూన్యతిథి ఉదు7.32వ |
| 9 | ఆ | పం మ3.20 ఆర్ద్ర ఉ8.58 రావ9.53ల11.36వ పంచమీతిథి సాదు3.51ల |
| 10 | సో | ష మ4.22 పున ఉ10.39 రావ7.8ల8.49వ పదు12.4 తిరిగి దు2.20ల |
| 11 | మం | స మ4.56 పుష్య ప11.53 రావ11.53ల1.34వ దినం28.11 ఉదు8.19 రాదు10.30ల |
| 12 | బు | అ సా4.50 ఆశ్రే మ12.35 రావ12.46ల2.23వ పదు11.19ల |
| 13 | గు | న సా4.27 మఘ ప12.49 రావ8.48ల10.23వ ఉదు9.50 తిరిగి దు2.23 |
| 14 | శు | ద మ3.29 పూఫ ప12.33 రావ7.38ల9.11వ దశమీతిథి ఉదు8.20 తిరిగి దు12.4ల |
| 15 | శ | ఏ ప2.8 ఉత్త ప11.55 రావ8.1ల2.33వ మతత్రయఏకాదశి తిథిద్వయం ఉదు7.35వ |
| 16 | ఆ | ద్వా ప12.24 హస్త ఉ10.54 రావ6.33ల8.4వ త్రయోదశితిథి సాదు3.49 |
| 17 | సో | త్ర ఉ10.25 చిత్త ఉ9.37 మవ2.53ల4.23వ దినం27.59 మాసశివ॥ పదు12.4 తిరిగి దు2.18ల |
| 18 | మం | ● చ ఉ8.14 అమా తె5.55 స్వా ఉ8.8 మవ1.21ల2.51వ అమా॥ ఉదు8.21 రాదు10.31 |
| 19 | బు | శుపా రా3.31 విశా ఉ6.30 అనూ తె4.46వ వ10.14ల11.53వ పదు11.20ల |
| 20 | గు | వి రా1.5 జ్యే రా3.6 ఉవ10.2ల11.31వ ఉదు9.51 తిరిగి దు2.19 |
| 21 | శు | త రా10.55 మూ రా1.39 పవ10.37ల12.7వ రావ12.14ల1.44వ ఉదు8.22 తిరిగి దు12.6 |
| 22 | శ | చ రా8.54 పూషా రా12.20 పవ10.41ల12.12వ ఉదు7.38వ |
| 23 | ఆ | పం రా7.9 ఉషా రా11.17 ఉవ8.0ల9.32వ రావ3.14ల4.47వ దినం27.49 మదు3.47ల |
| 24 | సో | ష సా5.44 శ్ర రా10.37 రావ2.38ల4.13వ పదు12.6 తిరిగి దు2.19 |
| 25 | మం | స సా4.43 ధని రా10.19 తెవ5.39ల ఉదు8.24 రాదు10.31 |
| 26 | బు | అ సా4.11 శత రా10.32 ఉశేవ7.12వ తెవ5.10ల పదు11.22ల |
| 27 | గు | న సా4.7 పూభా రా11.9 ఉశేవ6.44వ ఉదు9.54 తిరిగి దు2.20ల |
| 28 | శు | ద సా4.35 ఉభా రా12.21 ఉవ9.15ల10.56వ ఉదు8.25 తిరిగి దు12.18ల |
| 29 | శ | ఏ సా5.34 రేవ రా1.59 మవ1.10ల2.52వ దినం27.41 మతత్రయఏకాదశి ఉదు7.41వ |
| 30 | ఆ | ద్వా రా7.0 అశ్వ తె4.4 రావ11.49ల1.33వ సాదు3.48ల |

## ముఖ్య పండుగలు

3. కార్తికపూర్ణిమ జ్వాలాతోరణము. 24. సుబ్రహ్మణ్యషష్ఠి. 26. కాలాష్టమి.

# విషయసూచిక



ముఖచిత్రము: 'విలువిద్య'

చిత్రకారిణి: శ్రీమతి దామెర్ల సత్యవాణి.




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# మహిళామణి, మార్గదర్శకురాలు, మహారాణి శేతు పార్వతీబాయి

ప్రస్తుత తిరువాంకూరు సంస్థాన మహారాజావారి తల్లి మాతుశ్రీ మహారాణి సేతు పార్వతీబాయివారి శిలావిగ్రహమొకటి అక్టోబరు 22 వ తేదీనాడు తిరువనంత పురంలో మహారాజావారిచేత బహిర్గతము చేయబడినది. ఈ మహోత్సవ సమయమున దివాను సర్ సి. పి. రామస్వామయ్యరుగారును, మహారాజావారును, మహారాణీవారి గుణగణములను కొనియాడుచు, ఆమె తిరువాంకూరు సంస్థానమునకు, ముఖ్యముగ మహిళల అభ్యున్నతికి చేసిన అపారమైన సేవాసహాయములను వివరించి ప్రశంసించిరి.

స్త్రీల అభివృద్ధిలో యావద్భారతదేశమున అత్యంత ప్రాముఖ్యము వహించు కేరళ ప్రాంతమున తిరువాంకూరు సంస్థానమున నాయకమణియైన మహారాణీవారు ఆదర్శ విదుషీమణి యనుటకు సందేహమేమి?

స్త్రీత్వముయొక్క ఉత్తమోత్తమ సంప్రదాయములు మూర్తీభవించిన వ్యక్తియైన సేతు పార్వతీబాయిగారు తిరువాంకూరుకును స్త్రీలోకమునకును గావించిన ఉత్కృష్ట

ఉద్ధరణ కార్యములను గుర్తించి ప్రజలందరు ఏకగ్రీవముగను హృదయపూర్వకముగను కృతజ్ఞతాపూర్వకమగు ప్రశంసారూపముగ చందాలు విరాళములిచ్చి నిర్మింపజేసినదే యీ శిలావిగ్రహమని చెప్పబడిన మాట వాస్తవ మనవచ్చును. పదకొండునెలల కాలము లోపుననే 82,000 రూపాయిలు వసూలగుటయే ఇందుకు సాక్ష్యము. శిలావిగ్రహ నిర్మాణము, ప్రతిష్ఠ, ఆవిష్కరణోత్సవాదులకు ఖర్చయినది పోను ఇంకా సుమారు 50,000 రూపాయిలు మిగిలిపోవుననియు, ఈ మొత్తమంతయుకూడ స్త్రీ జనోద్ధరణ కార్యములకే వినియోగింపబడుననియు వినుట కెంతయు సంతసించెదము.

మహితోదారగుణోపేతుడగు యువక మహారాజావారి శీలసంపత్తికి కారణము అట్టి మాతయిచ్చిన సుశిక్షణమే యను నంశము ముఖ్యముగ నీ సందర్భమున సంస్మరింపబడుట సమంజసముగను, యోగ్యముగను ఉన్నది. మహారాణి మలయాళ, సంస్కృత భాషలందు పాండిత్యముగలది. కొంత ఫ్రెంచి భాషాజ్ఞానము గలిగియున్నది. లలితకళల యందు, సంగీతమందును ఈమె కభిమానము హెచ్చు. పరిశీలన - జ్ఞానార్జన దృష్టితో ఈమె చాలదేశముల సంచారముచేసిరి. తిరువాంకూరులో బాలికల నాట్య విద్యాభ్యాసముకొఱకు నర్తకాలయమును తెరిపించిరి. స్వాతీ తిరుణాళ్ సంగీత పరిషత్‌ను ప్రారంభింపజేసిరి. అఖిలభారత మహిళామహాసభా కార్యములందును, స్త్రీల జాతీయ సంఘ కార్యకలాపముల ద్వారాను ఈమె భారతీయ స్త్రీజనాభివృద్ధికొఱ కెంతయో పాటుపడుచున్నారు. వైదిక ప్రార్థనల తత్వము నీమెయు ఈమె బిడ్డలును అలవరచుకొని ఆచరణలో అనువదించుచున్నారని దివానుగారు చెప్పిరి.

ప్రసిద్ధమైన హరిజన దేవాలయప్రవేశానుమతి ప్రకటనము కీమె ఎంతయు ప్రోత్సాహము నిచ్చెనను మహోపకారము మరువరానిది. ఇట్టి తల్లికొడుకులవలన అభ్యుదయమునకు వచ్చుచున్న తిరువాంకూరు భవిష్యత్తున ఇంకా అనేకరెట్లు సంస్కరణ సౌభాగ్యములందు అగ్రగణ్యమగు సంస్థానము కాగలదను ఆశయు ఆకాంక్షయు వ్యర్థము కాజాలవు.

సేతు పార్వతీబాయిగారు భారతీయ సంస్కృతి, విజ్ఞానము, కళలు, సాహిత్యము యెడల విశేష గౌరవ ఆదరములుగల దేశభక్తురాలు. భారతీయ మతధర్మ ప్రధాన సూత్రములందును, భవిష్యత్ సంస్కరణశీలమునందును ఈమెకు ఉజ్వల విశ్వాసము గలదు. ఆచరణయుతమైన ఆదర్శవాదమును, దిట్టమైన స్వతంత్ర స్వభావమును ఈమె నైజగుణములు. సంఘమందును, ప్రజోపయోగకార్యములందును స్త్రీలకు యథాయోగ్యమైన స్థానమును సంపాదించుటకు మిగుల తోడ్పడి ప్రోత్సాహమిచ్చిన తిరువాంకూరు మహారాణి స్త్రీలోకమంతట కృతజ్ఞ సంస్మరణకు, హృదయపూర్వక ప్రార్థనాయుతమగు ఆశీర్వాదములకు పాత్రురాలు కాగలదు.



తిరువాంకూరు మహారాణీ
శ్రీ సేతు పార్వతీబాయిగారు



వెల్లంకి రామాబాయి

శ్రీ గౌతమీ వ్యాయామ కళాశాల విద్యార్థిని.

ఈమె దేశీయ వ్యాయామమందు పెక్కుతావుల యందు ప్రదర్శనములుచేసి బహుమానములందినది.

# సేవాన్వేషిణీ! — జాగ్రత్త!

( రేడియో ప్రసంగం )

**"నీ జీవితం సంఘసేవకు వినియోగించదలచుకున్నావా? మంచిమాటే! కాని— బాగా ఆలోచించుకో. దారిద్రం అనుభవించడానికీ, ప్రాణమే అర్పించడానికీ వుద్యుక్తురాలవైతే చాలదు. కృతజ్ఞతలేని సంఘం యొక్క సమ్మెటపోట్లకు గూడా తయారుగావుండాలి సుమా" అని అంటుంది యీ సంఘసేవకురాలు.**

సంఘానికి సేవచేసి నీ జీవితం సార్థకంచేసుకో అనే గుణపాఠం మనం యెప్పుడూ వింటూనే వుంటాము. బ్రతికిన మూడునాళ్లూ నా కాయుష్షూ, నా కారోగ్యం, నా కైశ్వర్యం అని మాత్రమే జపం చేసుకుంటూ కూర్చోకుండా నీదృక్పథాన్ని కాస్త యిటూ అటూ ప్రసరింపజేసి నీతోడి మానవులకు సహాయకారిగా వుండేట్టు ప్రవర్తించూ అని చెప్పడం విన్నాము. సంఘానికి సేవచేయడంలో స్త్రీ పురుషునికి తీసిపోకూడదనీ ప్రస్తుత పరిస్థితుల్లో మనసంఘం అధోగతిలో వుండడానికి కారణం సంఘసేవపట్ల స్త్రీ విముఖత చూపడమే కారణమనీ మనకి తెలుసు. ఔను, నిజమే. మనదేశం పాడువడిన గబ్బిలాల కొంపలాగుండడానికి ముఖ్యమైన కారణాలు రెండు—నిరక్షరాస్యత, గర్భదరిద్రం. ఈ రెండింటినీ నిర్మూలనం చేయడంలో స్త్రీలు యెక్కువగా తోడ్పాటవుతారు. ఆడపిల్లలకు పాఠశాలలు పెట్టడం, పెద్దలకు వృత్తివిద్యలు నేర్పడం, అంగులూ మొదలైన పేదలకు రక్షణగృహాలు నిర్వహించడం—యిల్లాగే అనేకవిధాలుగా సంఘానికి ఋణం తీర్చుకోవచ్చు స్త్రీలు. సంఘసేవయొక్క ఆవశ్యకతగురించి మనం చాలాసార్లు విన్నాము. కాని సంఘసేవకు కంకణం కట్టుకున్న స్త్రీల మనోప్రవృత్తి యెల్లా వుండాలీ అన్న విషయం మనలో చాలామందికి స్పష్టంగా తెలియదనుకుంటాను. ఈ విషయంగురించి చాలా తక్కువమంది పెద్దలు ముచ్చటించారని నా అభిప్రాయం. నా సంఘాభివృద్ధికి నేను నా శక్తి అంతా వినియోగిస్తాను, నా సేవ వినియోగంలోకి తీసుకోస్తాను అని నిశ్చయించుకొనే ముందర స్త్రీ కొన్ని ముఖ్యవిషయాలు గుర్తించాలి. సంఘ జీవితంలో, పబ్లిక్ లైఫ్ అన్నమాట, వుండే సాధకబాధకాలు ఆలోచించి, అవగాహనచేసుకుని, కట్టుబాట్లకు లోబడుట కొప్పుకొని మరీ సంఘజీవితంలో ప్రవేశించాలి. అంతేకానీ వుబుకుతోన్న వుత్సాహం అరికట్టలేక సంఘసేవకురాలవకూడదు. ఏమంటారా? సేవాతత్పరత యెంత ఆనందాన్నిస్తుందో అంత దుఃఖానికికూడా కారణమాతూంటుంది. నీ భర్తకు సేవచేస్తూ, నీ బిడ్డలకు ఆనందం చేకూరుస్తూ నీ కాలం గడిపేశావా - అంటే - నీ జ్ఞానసంపత్తి అంతా నీ కుటుంబసౌఖ్యానికే వినియోగిస్తావా - నీ విషయం యెవరూ తలపెట్టరు. నీ జోలి సంఘానికక్కర్లేదు. ఎంతో ఆనందం అనుభవించగలుగుతావు. నీ యిష్టం నీది, నీ సౌఖ్యం నీది, నీ 'ఊసు' నీది కనక. సంఘమే ఓ పెద్ద కుటుంబమని భావించి, నీ జ్ఞానసంపత్తిని నీ చిన్నికుటుంబానికే కాక పెద్దకుటుంబమైన సంఘానికిగూడా వినియోగించి సేవచేద్దామనుకుంటావా - అక్కడ వస్తుంది తంటా అంతా. సంఘంతో నువ్వెప్పుడైతే జోక్యం కల్పించుకుంటావో, నీతోకూడా సంఘం అప్పుడే జోక్యం కలుగచేసుకుంటుంది. సంఘం నీకు హారతులూ పడ్తుంది, కోదండాలూ తీయిస్తుంది. సంఘజీవితంలో ప్రవేశించావా వ్యక్తిజీవితం సున్న అవుతుంది నీకు. ఇదివరకల్లా నువ్వేంచేస్తున్నావో తెలుసుకోడానికి యిచ్చగించని సంఘం యిప్పుడూరుకోదు. సంఘం, సంఘం, సంఘం అంటే ఏమిటి? నీ యింటి యిరుగు పొరుగు అమ్మలక్కలు,

యిక్కడివారూ, అక్కడివారూ, - యింకా దేవుడు మెచ్చేస్తే - పత్రికలూ, క్లబ్బులూ, బార్ రూములూ, మార్కెట్లూ, పురాణాలూ, పేరంటాలూ - యివన్నీ సంఘానికి అవయవాలు. వీటిలో కొన్ని అంటాయి నిన్ను 'ఎంత మంచిపనిచేస్తున్నావే అమ్మా! నువ్వు నిర్వహిస్తూన్న శిశుసంరక్షణాలయం చిరంజీవి అవుగాక' అని. మరికొన్ని అంటాయి 'మరేం చేస్తుంది వేరే పని పాటూ లేకపోతే. అల్లా హడావిడిగా తిరిగేబదులు యింట్లో కూర్చుని రాట్నం వడుక్కోకూడదా!' అని. అంతేకాదు నీ వ్యక్తిజీవితం పోతుందిసుమా అని గూడా చెప్పాను. మీ కర్థంకాలేదేమో! ప్రైవేట్ అండ్ పెర్సనల్ లైఫ్ అనేది వుండకుండా పోతుంది. నువ్వేరకం చీర కట్టుకున్నావో, నువ్వు వంట బాగా చెయ్యగలవో లేదో - యిల్లాంటివే - నీ సంఘసేవతో నిమిత్తం లేని వాటినిగురించి తెలుసుకోడానికి ప్రయత్నిస్తుంది. ప్రయత్నించి ఆ విషయాలన్నీ బట్టబయలు చేస్తుంది. సంఘం యిల్లా చేసింది అని కోపగించడానికి హక్కులేదు నీకు. నువ్వు చేసే సేవని సంఘం గుర్తించి ప్రోత్సాహం యిస్తుందా, సరే - ఫరవాలేదు. నీ సేవను విమర్శించి అపార్థాలు కల్పించడానిక్కూడా సంఘానికి హక్కువుంది. బాణాలవంటి మాటలాడి పేదరాసి పెద్దమ్మ నీ మనస్సు చివుక్కుమనిపించవచ్చు; విషం వెళ్ళగక్కి ఓ వ్రాతగాడు నీ ప్రాణం తియ్యడానికి ప్రయత్నించవచ్చు. ఈ దెబ్బలన్నిటికీ నువ్వు తట్టుకోవాలి. ఎంతో మనోదార్ఢ్యం ప్రదర్శించి నిశ్చలహృదయంతో పనిసాగించాలి. తెలిసిందా! సంఘానికి శక్తికొలదీ సేవచేస్తాను అనే ఆసక్తితోపాటు విషమపరిస్థితుల్ని యెదుర్కోడానికి చాలినంత గుండె నిబ్బరం కలిగివుండాలి. ఇది నీలో లేదా - ప్రపంచాన్ని మరమత్తుచేస్తాను అనే అహంభావం వదిలెయ్యి. నీ కుటుంబానికి సేవచేసుకోడంతోటే కాలం గడిపెయ్యి.

నేను నమ్మినదేదో స్వార్థం అనేది లేకుండా చేస్తాను - అందరిగొడవ నాకెందుకు అంటావా మంచిదే. కాని ఒకటి జ్ఞాపకముంచుకో. నీ యిరవైనాలుగుగంటలూ సంఘానికే వినియోగిస్తూ, దానివల్ల దరిద్రం అనుభవిస్తూ, పడరానిపాట్లు పడుతూ సేవచేస్తూంటే, ఆ సంఘం నీకు కాస్త వుత్సాహం యివ్వక పోతే, 'బాగున్నావా అమ్మా' అని అడగకపోతే నువ్వేమౌతావు? నేనీ సేవ యెవరికిచేస్తున్నాను? ఎందుకు? అని నిస్పృహ చెందవూ? సహజం. ఇంతెందుకూ? ఒక సంగతి చెప్తాను విను. ఎన్నటినుంచో కొంగున దాచుకున్న పావలా డబ్బులతో బంగాళాదుంపలు కొని, పక్కింటి వెంకెమ్మగారిదగ్గర జీలకఱ్ఱపిసరు బదులు చేసి, కేరుమంటోన్న చంటిదానికి తియ్యటి కబుర్లుచెప్పి బుజ్జగించుతో, ఎంతో కష్టపడి బంగాళాదుంపల మసాళాకూరచేసి ఎంతో ఆప్యాయంగా మీవారికి వడ్డించావనుకో. కమ్మగా రొట్టలు వేసుకుంటూ తింటూన్న మీ ఆయన రుసరుసలాడుతూ 'అబ్బే! ఇంతాచేసి యిదా కూర? నీ మొహంలాగే వండావు!' అంటాడనుకో. నీ మనస్సెల్లాగుంటుందప్పుడు? ఇల్లాంటి సందర్భాలే నీ వనేకం ఎదుర్కోనవలసివస్తుంది. సంఘసేవ చేస్తాను, చేస్తాను, అని వుబలాటపడే ముందు యీ విషయాలన్నీ తెలుసుకో! తరువాత చింతించి లాభంలేదు. నిష్కళంకమైన సేవాబుద్ధి వుంటే చాలదు. నిష్కామకర్మ చెయ్యాలి. పూజలుచేసి దేవుని మెప్పించి భళీ అనిపించుకోవచ్చు గాని సంఘానికి సేవచేసి సెబాస్ అనిపించుకోడం కష్టతరం. ఒకరిమెప్పు పొందుదామని సంఘసేవకి వుద్యుక్తురాలవయావా నీ పాట్లు నీకు తప్పవు.

ఔను, సంఘం ఎల్లా అభివృద్ధిపొందుతుంది? నిస్వార్థమైన బుద్ధి, నిష్కళంకమైన దేశభక్తి, సీగ్ఫ్రీడ్ లైన్ వంటి గుండెనిబ్బరం—యివి వుంటేనే నీ సేవ రాణిస్తుంది.

—దుర్గాబాయి.

# గృహిణి

శ్రీమతి తాడిమేటి సీతామహాలక్ష్మి

ప్రతి గృహమునకు గృహిణి శిరోభూషణము. మానవసేవకైనను, దేశసేవకైనను ప్రతి గృహిణి గృహస్థునికి సహాయము చేయుచుండవలెను. యిందునుగురించి నాకు తెలిసిన స్వల్పవిషయములను యిందు వ్రాయుచున్నాను.

## స్త్రీ విద్య

ప్రతి స్త్రీకి విద్య ముఖ్యావసరము. యిది ఎంతవరకు కావలయును? కనీసము మాతృభాషలో చదువను వ్రాయను పూర్తిగా నేర్చుకొని, భారత భాగవతాది పురాణగ్రంథములను బాగుగా అర్థము చేసుకొను శక్తి గలిగియుండవలెను. పురాణగాధలను ఆదర్శముగా చేసుకొని జీవితమును కాలానుగుణముగ మార్చుకొనుచుండవలెను. పతివ్రతా శిఖామణుల చరిత్రలను చదివి వాటి ఆదర్శములతో తమ శక్తికొలది వారిని అనుసరించ ప్రయత్నము చేయవలెను. కొంతవరకు రాజకీయములను కూడ తెలుసుకొనుచుండవలెను. ప్రపంచపరిస్థితుల కనుకూలముగా భర్తకు ప్రతివిషయమునను చేయూతగా వుండవలెను. యిది యట్లుండగా గృహవైద్యము, బిడ్డలను పెంచు విధానము చక్కగా నేర్చుకోవలెను. రాష్ట్రభాషయైన హిందీకూడా ముఖ్యంగా నేర్చుకొనవలెను.

## చేతిపరిశ్రమలు

ప్రతి వనితయు తనకు యిష్టమగు (అనగా తనకు ఉత్సాహముగావున్న) కొన్నిగాని, చాలాగాని చేతిపరిశ్రమలు నేర్చుకొనియుండుట మంచిది. ముఖ్యంగా రాట్నంపై నూలుతీయుట, అల్లిక, కుట్టుపని నేర్చుకుని తీరికసమయములందు చేయుచుండవలెను.

## పాతివ్రత్యము

మన హిందూదేశమున (మతమున) వివాహవిధానము చాలా పవిత్రమైనది. ప్రేమించిన యువతీ యువకులు భగవంతుని సముఖమున తమ యావజ్జీవము భార్యాభర్తలుగా వుండుటకు మంత్రములద్వారా ప్రతిజ్ఞచేయుదురు. కనుక తమ జీవితమునందు అనల్పమైన ఒడుదుడుకులు వచ్చినను ఓపికతో నిర్వహించుకొనవలెను. ముఖ్యంగా స్త్రీ ఎల్లప్పుడును భర్తనే దైవముగ నెంచుకొనుచు వాని సుఖముకై ఎట్టి త్యాగమునైనా చేయ సిద్ధముగా నుండవలెను. అట్లు చేసిన యిహపరసౌఖ్యములు చేకూరును. కొన్ని సమయములందు భర్త తన్ననాదరణ చేసినట్లైన తనలో లోపమేమైన యున్నదేమో సవరించుకుని ఆయన మనస్సు కనిపెట్టి తదనుగుణముగా ప్రవర్తించవలెను. భర్త దుష్టుడైనచో ఓర్పుకలిగి నేర్పువహించి అతనికి బోధచేసి పాతివ్రత్యము నిర్వహించవలెను. భర్తను సన్మార్గములోనికి తీసుకురావలెను. యిది ప్రతి హిందూ స్త్రీకి వుండవలసిన ప్రవర్తన. అట్లుకాక స్వల్పవిషయములు కారణములుంచుకుని భర్తలతో కలహించుచు జీవితములను దుఃఖపూరితముగా చేసుకొనరని నమ్ముచున్నాను.

506

# స్త్రీవిద్యావిధానము

(జయపురాధీశులగు మహారాజా శ్రీ విక్రమదేవవర్మ రచనలనుండి)

---

విద్ — జ్ఞానే యను ధాతువువలన నుత్పన్న మగుటవలన "విద్య"యను శబ్దము జ్ఞానాభివృద్ధి హేతుకార్థమునందు వ్యవహరింపంబడుచున్నది. విద్య యనఁగాఁ జదువు. జ్ఞానము విజ్ఞానము నని జ్ఞానము ద్వివిధము. పరవస్తుబోధము జ్ఞానము; ఇహవస్తుజాలబోధము విజ్ఞానము. కనుక విద్యావంతులనఁగ జ్ఞానులనియో లేక విజ్ఞానులనియో యెఱుంగనగును. లేని జ్ఞానమునుగాని విజ్ఞానమునుగాని విద్య గలిగింపఁజాలదు. అది బుద్ధిని సంస్కరించి మూసికొనియున్న కన్నులను దెఱచునట్లు మాఢ్యమునొందియున్న తెలివిని వెలిఁగించును. కనుకనే విద్యనేర్చినవారి తెలివి చికిలిచేసినకత్తి వోలె మెఱయుచుండును. విద్య నేర్వనివారి బోధము జడత్వమునొంది యుండుటవలననే యట్టివారు పశుసమానులని నిశ్చయించి "విద్యావిహీనః పశుః" అని కవి నుడివెను. కావున స్త్రీ పురుషు లందఱును విధిగా విద్య నభ్యసింపవలెను. పడఁతి విద్యావతియగు నేని చెడు ననునది యార్యోక్తిగాదు. తన యర్ధాంగియగు భార్య విద్యాహీన యగునేని విద్యావంతుఁడగు వాని జీవితము పక్షఘాత రోగాక్రాంత శరీరమును బోలియుండును గాదా! కాన స్త్రీ సైతము విద్యావతియై యుండవలెననుట సుస్పష్టము. అట్లయ్యు స్త్రీలకును బురుషులకును వలయువిద్య యేకవిధముగా నుండవలెనా? లేక తారతమ్యము గలదిగా నుండవలెనా? అనునది విచార్యవిషయము. స్త్రీలకును బురుషులకును జ్ఞానాభివృద్ధికరమగు చదువునందుఁ దారతమ్య మక్కఱలేకున్నను, విజ్ఞానాభివృద్ధికరమగు చదువునందు నది యుండవలెను. తన పోషణమునకును దన కుటుంబపోషణమునకును వలయు ధనాదుల నార్జించుట కుపయోగించు చదువు పురుషునకును, తానును దనకుటుంబమును సుఖముగా జీవించుట కుపయోగించుచదువు స్త్రీకి నుండవలెను. స్త్రీ తన గృహమున నివసించి యింటిపనులను నెరవేర్చుచు ధనార్జన సాధనముల నవలంబింపవచ్చును. స్త్రీ పురుషులకు రక్త మాంసాదులయందును బుద్ధియందును భేదము లేకుండఁగాఁ జదువునందును బనుల యందును భేదమేలయుండవలెను? అని కొందఱ తలంపు. పశుపక్ష్యాదులలో స్త్రీ పురుష భేదము లేక యవన్నియు నాహారములను సంపాదించుకొనుచు స్వేచ్ఛగాఁ జరియించుచుండ, మనుజులుమాత్ర మేల యట్లాచరింపరాదు? అని స్థూలబుద్ధులకు స్ఫురింప వచ్చును. బాగుగా నాలోచించినచో, నజ్ఞానులయి వివాహమును మానినవా రుపరికథిత పశుపక్ష్యాదిపద్ధతి నవలంబింప వచ్చును. కాని వివాహమయి కుటుంబాభివృద్ధిని గోరువా రట్లు లవలంబింపరాదు. కుటుంబాభివృద్ధిని గోరువారు ముందుగా నివాసము నేర్పఱచుకొనవలెను. పురుషులు వెలుపలితావులకు వెళ్లుచు ధనాదులనార్జించి తెచ్చి నిజమందిరమునఁ జేర్చుచుండవలెను, అట్లు తెచ్చిన పదార్థముల రక్షణాపేక్షణములను స్త్రీ లొనర్చుచు వానిని దమవారియొక్కయు దమయొక్కయు సౌఖ్యముకొఱకు యుక్తముగా నుపయోగించుచుండవలెను. అట్లు చేయఁబడుచున్న కుటుంబమె సుఖించును. స్త్రీ పురుషు లింటఁ గూర్చుండి కుడుచుచు ధనాదుల నార్జింపనిచోఁ దమ జీవయాత్ర సాగదు. స్త్రీపురుషు లుభయులు నన్యస్థలములకేగి ధనాదుల నార్జింపఁ గడంగుదురేని, అవి వృద్ధినొందినను, వారికి దాంపత్యసుఖము క్షీణించును; మఱి కుటుంబార్జనమువలన నొంద నాసించు సుఖము సన్నగిల్లును.

ఇఁక నేతద్దేశముయొక్క వర్తమాన విద్యావిధానమును గూర్చి యించుక చర్చింతము. మన పాఠశాలలందు నేర్పఁబడుచున్న విద్య గొంతవఱకు భాషాభివృద్ధిని జేయుచున్నను, దానివలన జ్ఞానముగాని విజ్ఞానముగాని పెంపొందక యాముష్మికలాభముగాని యైహిక లాభముగాని లభింపదు. ఇప్పటి విద్యావిధానము

కేవలము సేవకవృత్తికే యుపకరించును. సేవకవృత్తియే గౌరవావహమనియు లాభకరమనియు నెంచు మానవుల మానసములకుఁ దద్విధానము రుచించినను, విద్యావంతులు స్వచ్ఛందజీవనము సేయుచుండవలెనని తలంచు వారి మనస్సుల కది రుచింపఁదు. ఇప్పటి చదువులలో వైద్యవిద్యమాత్రమే స్వచ్ఛందజీవనము సేయుటకుఁ గొంద అను వలనుపడుననియుఁ బెఱచదువులు సేవకవృత్తికే యుపయోగించుననియు నుడివెడి నుడి యతిశయోక్తి గాఁజాలదు. కనుక మన పాఠశాలలందు నేర్పఁబడుచున్న చదువు పురుషులకే నిరుపయోగమగుచుండ నది స్త్రీల కుపయోగించునా? బొత్తిగ నుపయోగింపదు. తమ దేశమందుఁ గల పాఠశాలలు సర్వాంగపూర్ణలనియుఁ దాము విదుషీమణులమనియు విఱ్ఱవీఁగు పాశ్చాత్యభామలను బరికించి డాక్టరు జె. ఎ. మోజియనను నార్వేదేశ పండితుఁడు నిజమనమునఁ గుందుచుఁ బాశ్చాత్యదేశములందు నేర్పఁబడుచున్న విద్యలు స్త్రీలకు నుపకరింపమి స్త్రీలు స్త్రీత్వమును బోఁగొట్టుకొనుటవలన నచ్చటి కుటుంబములు గూలిపోవుచున్నవనియుఁ దద్దేశ విశ్వవిద్యాలయములు బాలికలపాలిటి శ్మశానములే యనియు ఘోషించుచుండఁగా నిక్కడి విద్యావిధానము మన స్త్రీల కుపయోగకరముగా నున్న దనఁగలమా? మన పాఠశాలలకును విశ్వవిద్యాలయములకు నేమి పేరిడవలెనో యది నాకుఁ బొడకట్టకున్నది. కుటుంబములు వృద్ధియగుటకు నారోగ్యము వొందుటకును సుఖజీవనము సల్పుటకును వలయు విజ్ఞానమునిచ్చు విద్యలనే స్త్రీలకు నేర్పవలెను. బాలికలు యుక్తముగాఁ జదువుటను వ్రాయుటను నంకగణితమును నేర్చినపిమ్మటఁ బూర్వుల చరిత్రములను దెలిసి తాము సద్గుణవతులగుటకుఁ బురాణములను, పాకశాస్త్రాదిగార్హ్యశాస్త్రములను, శిశుపోషణవిధానమును, స్వల్పచికిత్సలను బోధించు విద్యలను, సంగీతము, సీవనము, చిత్రలేఖనము మొదలగు కళలను, గొన్ని కుటీరశిల్పములను నేర్చి పెంపొందవలెను. అంతేకాని, దాస్యమున కుపయోగించు విద్యల నభ్యసింపరాదు.

ఏతద్దేశ సతులు పాశ్చాత్యభామల పై తళుకుబెళుకులనుగాంచి భ్రమయక యుక్తవిజ్ఞానయుక్తలగుచు సత్సంతానవతులయి స్వదేశ క్షేమాభివృద్ధిని జేయుదురుగాక !

## నారీశిరోమణీ !

దరహాసచంద్రిక తాండవింపంగ
చిడిముడి వడకుండ చీదరింపకిల
వినయ వినమ్రతన్వీడక నీవు
మాటలాడెద వెప్డు మానినీమణిరో !

కోపమెప్డు స్త్రీకిఁ గూడదటంచు
వినయ విధేయతల్ వీడరాదంచు
మానమె వనితకు మానికమంచు
అంచునుండెద వెపు డంగన నీవు !

కరుణయె స్త్రీకి కనకమటంచు
కులవిభేదములెప్డు కూడదటంచు
అందఱు మానవు లతనికి సములు
అకళంకు లెపు డిల నధికు లటంచు

పావనజీవులె పారు లటంచుఁ
గల్మషజీవులె కానివారంచు
గుణములేనపుడు కులమేల నంచు
వచియించెద వెపుడు పావనజీవి !

—శ్రీ సో. రామచంద్ర అగస్త్య, ఎం. ఏ.

# గ్రంథ స్వీకారము

**మైనాదేవి; మొరాన్‌కన్య (కావ్యద్వయి)**

సాహితీమేఖల ప్రచురణములు. కర్త: అంబటిపూడి వెంకటరత్నంగారు. విక్రమ, విజయదశమి నాడు వెలువడినవి. వెల 1 రూపాయి. సాహితీమేఖల, ఇనగల్లు, వయా చీరాల, గుంటూరుజిల్లాకుగాని; లేక, సాహితీమేఖల, కోటయ్యగూడెం, చండూరుపోస్టు, నల్లగొండజిల్లా(నైజాం)కుగాని వ్రాసిన ప్రతులు దొరకును.

**ప్రణయవాహిని (కావ్యం)**

కర్త, అంబటిపూడి వెంకటరత్నంగారే. సాహితీమేఖలవారివద్ద దొరకును. వెల తెలియదు.

**గబ్బిలము (కావ్యము)**

కవి; జి. జాషువ, తెలుగు పండితుడు, వినుకొండ, గుంటూరుజిల్లా. వెల 0-12-0.

**శ్రీ కృష్ణగీతావళి; ఏకాంకములు**

రచయిత్రి: పాకల రాజామణెమ్మ. ఏలూరు పవరుపేట ఆంధ్రా ఆర్ట్ప్రెస్‌నందు ముద్రణము.

**1943-తో కృతయుగమురాదు, కలియుగము పోదు**

గ్రంథకర్త: అవధానం నారాయణయ్య, కల్లమడి, పామిడిపోస్టు, అనంతపురం జిల్లా. వెల 0-4-0.

**వీరాభిమన్య (నాటకము)**

ఐదంకములు. గద్యపద్య సహితము. కర్త: ఊటుకూరు సత్యనారాయణరావుగారు. తొలికూర్పు ప్రమాది శరత్తు. ముద్రణ ప్రచురణకర్తలు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 292, ఎస్ప్లనేడ్, మదరాసు. వెల తెలియదు. 8 అణాలు కాబోలు.

**ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర ; అనుబంధమున్ను**

చెన్నపట్టణములోనుండిన సుప్రసిద్ధ ఆంధ్రమహాపురుషుడు 1830-1831 మధ్య భారతదేశ స్థితిగతు లనుగురించి వ్రాసిన దినచర్య, లేఖలు. తృతీయ ముద్రణం 1941. సంపాదకుడు: దిగవల్లి వేంకటశివరావుగారు బి. ఎ., బి. ఎల్., బెజవాడ. వెల 2 రూ.

**ఆంధ్రగ్రంథాలయం (సచిత్ర ఆంధ్రాంగ్ల త్రైమాసిక పత్రిక)**

సంపు. 2, సంచికలు 1-2 జనవరి ఏప్రిలు 1941 నాటిది అక్టోబరు 1-వ తేదీని చేరినది.

సంపాదకులు: గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పుణ్యమూర్తుల రాజశేఖరం, పాతూరి నాగభూషణం గార్లు. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, బెజవాడ. కార్యస్థానము పటమటలంక.

**ఆంధ్ర దేశగ్రంథాలయ సంఘము: ఇరువదియేడవ సంవత్సర నివేదిక.**

ప్రచురణ 1941. కార్యస్థానము పటమటలంక (వయా) బెజవాడ.

**ముసలమ్మ మరణము (పద్యకావ్యము.)**

కర్త: డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు.

తన గ్రామవాసుల రక్షించే నిమిత్తం సంతోషముతో ఆత్మబలిదానము గావించిన నారీరత్నము యొక్క అద్భుతచరిత్ర మిందు వర్ణింపబడినది. సి. ఆర్. రెడ్డిగారు తమ ఇరువదవయేట వ్రాసిన ఈ గ్రంథము వారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున మూడవమారు మరల ముద్రింపబడినది. ఇంపీరియల్ సైజు. ముచ్చటైన అచ్చు. వెల నాలుగణాలు. ప్రచురణకర్తలు: ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, పటమటలంక (వయా) బెజవాడ.

**విహారి (సారస్వత రాజకీయ పక్షపత్రిక.)**

డెమ్మీ క్వార్టో 16 పేజీలు. సాలుచందా 2-0-0. విడిప్రతి అణా. సంపుటి 1, సంచిక 1. అక్టోబరు 15. ఎడిటర్, జి. ఎన్. హరి, రాయపేట, మదరాసు.

# దేవదాసీల సంస్కరణము

## కొచ్చిన్ ప్రకటనకు అభివందనములు

### మదరాసు ప్రభుత్వమునకు హెచ్చరిక

శ్రీమతి డాక్టర్ ఎస్. ముత్తులక్ష్మిరెడ్డిగారు, ఎమ్. బి., సి. ఎమ్.

("గృహలక్ష్మి"కి ప్రత్యేకము వ్రాసిపంపిన ఆంగ్లవ్యాసమున కనువాదము.)

"కొచ్చిన్ ప్రభుత్వంవారు ఈ మధ్యనే తమ దేవాలయములలో దేవదాసీల నాట్యము గానమును నిషేధించుచు ప్రకటనము చేసిరి. సాధారణముగా స్త్రీల అభ్యున్నతి కొఱకు పాటుపడుచున్నవారందరును, ముఖ్యముగా మానవజాతిలో నిమ్నస్థితిలో ఉన్నవారి సంస్కరణకొఱకును ఉద్ధరణకొఱకును పాటుపడుచున్న వారందరూ, ఈ కొచ్చిన్ ప్రభుత్వ ప్రకటనమునకు హృదయ పూర్వకముగ సంతోషింతురనుట నిశ్చయము. కొచ్చిన్‌వారి దేవాలయములలో దేవదాసీల సేవలను మాన్పించవలెనను శాసనమును చాలా కాలము క్రిందటనే కొచ్చి ప్రభుత్వమువారు ప్యాసుచేసిన సంగతి, సంఘ పారిశుధ్యమును సంఘశ్రేయమును గూర్చిన సంస్కరణాభివృద్ధి కోరు మావంటివారికి జ్ఞాపకమున్నది. అయితే ఇంతవరకూ ఈ మంచి సంస్కరణము ఎందుచేత అమలు పరచబడలేదో అర్థముకాదు. ఆలశ్యమయినను ఇప్పుడయినా, ప్రస్తుత కొచ్చి ప్రభుత్వమును, కొచ్చిను మహారాజావారును, మన సంఘములో అత్యంతఅవసరమయిన యీ సంస్కరణమును చేయుచున్నందుకు మన హృదయభరిత ప్రశంసకు పాత్రులు, అభివందనార్హులు.

మన హిందూదేవాలయములు పూజకు యోగ్యమయిన స్థానములు కావలెనంటే, ఆచోట్ల పవిత్రత భక్తి శ్రద్ధల వాతావరణము ఉండవలెను. కాని, ఎట్టి సందర్భములలోను, దేవాలయముల సేవకులందుగాని పూజాదులు చేయువారియందుగాని ఎట్టి అసభ్యతయు అవినీతియు అపవిత్రతయు ప్రోత్సహింపబడకూడదు, సహింపబడకూడదు.

అసలు, మొట్టమొదట "దేవదాసీలు" పవిత్రముగ కన్యాత్వమున జీవితములు గడుపవలయుననియు తమ భక్తిపూర్ణ కీర్తనములతోను గీతములతోను దేవాలయముల సేవ చేయవలెనని ఉద్దేశ్యమై యుండెను. కాని, దౌర్భాగ్యవశమున, ఏ కారణముచేతనయితేనేమి, అక్కడక్కడ ఒక్కొక్కరు మినహా, యీ జాతి అంతా గర్హ్యమైన మనుష్యులుగా తయారయినారు. వ్యక్తులకూ సంఘానికీ ప్రమాదకరమైన విధముగా, చాలా అనారోగ్యకరమైనట్టియు విషయలోలతతో కూడుకున్నట్టియు జీవనములు అలవరచుకొని యీ జాతి చెడిపోయినది.

మైసూరు సంస్థాన ప్రభుత్వమువారు 1909 వ సంవత్సర ప్రాంతములోనే, ఒక జి. ఓ. ను ప్యాసుచేసియుండిరి. మైసూరుప్రాంత దేవాలయములలో దేవదాసీల సేవ సంపూర్ణముగా నిషేధింపబడినది.

తర్వాత, మదరాసు శాసనసభవారు, 1930 వ సంవత్సరమున ఇందుకు సంబంధించిన చట్టమునకు పూనుకొని, హిందూమత ధర్మాదాయముల చట్టమును సవరించు లాను ప్యాసుచేసిరి. దేవాలయములలో

దేవదాసీల సేవను నిషేధించుటయు, వారికి ఇనాముహక్కు లిచ్చుటయు ఈ సవరణోద్దేశమైయుండెను. దానితో యీ చెడుపద్ధతి అంతమయియుండెడిది. కాని, ఈ అవమానకరమయినట్టియు, సంఘమునకు బాధాకరమయినట్టియు, దురాచారమును తుదముట్టించునట్లుగా, ప్రభుత్వమువారుగాని హిందూమత ధర్మాదాయముల బోర్డువారుగాని అన్ని దేవాలయములలోను ఈ చట్టమును పూర్తిగా అమలుపరచకపోయిరి.

అందువలన, శ్రీ గాంధీమహాత్ముని నాయకత్వముక్రింద కాంగ్రెసుమంత్రివర్గమువారు ఇంకొక సంస్కరణచట్టమునకు పూనుకొనవలసివచ్చెను. దేవాలయములలో సేవకొఱకు అని దేవదాసీలుగ బాలికలను దత్తము (అర్పణ) చేయు పద్ధతినే నిషేధించి శిక్షార్హము చేయగోరిన దీ చట్టము. ఈ బిల్లు సెలెక్టుకమిటీ స్టేజిని జయప్రదముగ దాటియుండెను. శాసనసభలో ఇది ప్యాసుఅగుట మాత్రము తరువాయిగా ఉండగా, కాంగ్రెసు ప్రభుత్వవర్గము రాజీనామాలు దాఖలుచేయుట జరిగెను.

ఈ సంస్కరణకు హిందువులందరును ఏకగ్రీవ ఆమోదము చూపిరనుట నిస్సంశయము జాతి, కులము, రాజకీయపక్షముల భేదములేక యావన్మంది హిందువులు ఈ సంస్కరణ ఉద్దేశమును బలపరచిరి.

ఎలాగయితే నేమి, ఈ రాష్ట్రములో కొన్ని దేవాలయములలో ఇంకను బాలికలను అర్పించుట, దేవదాసీ సేవ, అనుమతింపబడుచునే యున్నదనుట చాల శోచనీయము. దేవాలయాధికారుల అజ్ఞానము మొండితనము ఇందుకు కారణములు.

ఈ సంబంధమున, మనము గమనింపవలసిన దొకటున్నది. బొంబాయి ప్రభుత్వమువారును, తిరువాంకూరు సంస్థానమువారును, మదరాసు సంస్కరణను అనుకరించి, ఒక్క కలంపోటుతో, ప్రభుత్వ ఉత్తర్వుతో, తమ ప్రాంతపు దేవాలయములలో ఈ దురాచారమును పూర్తిగా తుదముట్టించిరి.

అందుచేత, సెలెక్టు కమిటీ స్టేజిని గడచి యుండిపోయిన, దేవదాసీల సంబంధమైన బిల్లును, మదరాసు ప్రభుత్వమువారు "లా"గా ప్యాసుచేసి అమలు జరిపింపవలెనని హెచ్చరించెదము. అట్లయిన, అమాయికలగు బాలిక లనేకులను విషాదమయ జీవితములనుండి రక్షించుట యగును."

---

# స్వీకారము

**ఆనందవాణి దీపావళి సంచిక 1941**

వెల 6 అణాలు. క్రౌనుసైజు 224 పేజీలు. సంపాదకుడు, పుచ్చలూరి కాళిదాసుగారు, బి.ఎ., బి.ఎల్., 9 లింగిచెట్టి వీధి, జార్జిటవును, మదరాసు.

---

# సవరణ – గమనిక

ఈ సంచికలో ప్రచురింపబడిన "స్త్రీలు - వ్యవసాయం" అనే వ్యాసము శ్రీమతి కె. సుగుణమణిగారు వ్రాసినట్లు పొరపాటున ముద్రించితిమి. తూర్పుగోదావరిజిల్లా వ్యవసాయోద్యోగులైన శ్రీ యస్. సీతారామపాత్రుడుగారు రాజమహేంద్రవరములో చేసిన ఉపన్యాసమిది. దీనిని మాకు పంపినవారు శ్రీమతి కె. సుగుణమణిగారు c/o కె. భూషణంగారు బి. ఎస్‌సి. (ఎగ్రికల్చర్) సామర్లకోట. వ్యాసపు కాగితములపై పాత్రుడుగారి పేరు లేక, పంపినవారు సుగుణమణిగారైనందువలన యీ పొరపాటు జరిగినదని పాఠకులు గ్రహింతురు గాక.

సంపాదకుడు.

# గొడ్రాలు

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

దత్తు చిన్నచదువు చదివినా ఉద్యోగంమాత్రం లభించింది. బ్యాంకి గుమస్తాగా పనిచేస్తూ తల్లిదండ్రులమాట జవదాటక వినయవిధేయతలతో మెలగుతూ ఉండేవాడు. వరలక్ష్మమ్మ ఏకపుత్రుణ్ణి పాతికేళ్ల వాడైనా పసిబిడ్డవలె చూచుకొని హితవు తగవూ గరపుతూ వుంటుంది. తండ్రి కామశాస్త్రిగారి కమీషన్ వ్యాపారం జోరుగా సాగుతూ క్రమంగా ఆపట్నంలో వారు గొప్పవారిండ్లలో పేరుపడ్డారు.

కాంతం కాపరానికి వచ్చి ఐదు సంవత్సరాలయింది. కావలసిన సంబంధమేఅయినా కాంతాన్ని దత్తుకు చేసుకోవటంలో వరలక్ష్మి కేవలం అభిమానంచేత కాకపోయినా అప్పటి తమ స్థితిగతు లాలోచించింది. పిల్లవాని పెండ్లినాటికి కామశాస్త్రిగారిది ఎత్తుడు కాపరమే. అందువల్లనే ఏకపుత్రుడైనా ఉన్నత విద్య చెప్పించలేకపోయారు. ఇప్పుడైశ్వర్యం అబ్బింది.

లేనివారింటిపిల్ల అని కాంతంమీద వరలక్ష్మికి కొంచెం నీరసభావం ఉండేది. కాంతం మరేవిషయంలోను లేనివారింటిపిల్లవలె ఉండదు. బీదవారైనా ఒక్కపిల్ల అవటంచేత అతి సుకుమారంగా కాంతం పెరిగింది. యథోచిత విద్య నేర్చింది. సౌందర్యమే స్త్రీల కలిమిలేములు నిర్ణయించేటట్లయితే కాంతం నిజంగా కలుముల జవరాలని చెప్పవలసిందే! ఆమె విశాలముఖంలో, లావణ్య నేత్రాల్లో, లక్ష్మి తాండవమాడేది. వేలలో ఎన్నదగిన చక్కదనం. ఏపుగాపెరిగి సర్వాంగసుందరిగా ఉన్నదామె! ఆమె పేదవారింటి బిడ్డ యని చూచినవారెవరూ అనుకోరు.

వరలక్ష్మి కోడల్ని లోకసామ్యంగా ‘అత్తగారి బాధ’లేవీ పెట్టేదికాదు. కాని ఆమె కాంతాన్ని చూచినప్పుడల్లా ఒకటేవిచారం. ఐదుసంవత్సరాలైనా ఆమెగర్భం యింకా ఫలించలేదని! అదే ఆమె మనస్సుకొక పిచ్చిగాపట్టి కాంతం విషయంలో వైముఖ్యం కలిగించింది. మంచి చీరగాని నగగాని కొనవలసిన సందర్భంవస్తే ‘ఆమె కడుపున ఒక కందపుట్టి నాకళ్లపడితే పెట్టిస్తా’నని తోసిపుచ్చేది. కాంతం మనసు చిన్నపుచ్చుకొని మాట్లాడలేకపోయేది. పుట్టింటివారుగాని, అత్తవారుగాని ఏ నగలూ నాణ్యాలు పెట్టకపోయినా సహజ సౌందర్యవతి కావటంచేత ఆమె కేవంకా లేకపోయింది.

ఐశ్వర్యం బాగావృద్ధికావటం, అన్ని హంగులూ కుదిరిఉండటం, మధ్య యీ ఒక్కలోపం కలిగి ఉండటం సహించలేక వరలక్ష్మి తోడి అమ్మలక్కలందరితోను ఊసుగా తనకోడలి గొడ్రాలితనాన్ని గురించి వంకరగా మాట్లాడ్డం, కొడుకుముందే కాంతాన్ని వంకరగా ఎత్తిపొడవటం మీరి, చివరకు కొడుకుతో రహస్యంగా కాస్త గట్టిగా ఆమెలోపం తెలియపరుస్తూ వచ్చింది.

మాసములు, సంవత్సరములు గడుస్తున్నాయి. వరలక్ష్మికిమాత్రం మనుమడ్నిఎత్తే ప్రాప్తం లేకపోయింది. కాంతం కాపరానికివచ్చి ఎనిమిది సంవత్సరాలైపోయింది. అత్తగారింక సహించలేకపోయింది. ఆమె సావిట్లో కూర్చొని ఊరి అమ్మలక్కలందరితోనూ రోజూ ఇదే విషయం ఎత్తటం, వారంతా తలో మాట విసరటం, చూచాయగా కొంతవినీ విననట్లు కాంతం మేడమీదకు పోయి తన విచారం మరచేందుకు ఏ సద్గ్రంథమైన చేతపట్టేది.

‘నేను చేసిన నేరమేమిటి? నావల్ల వీరంతా పడుతూఉన్న బాధలేమిటి? నాకు బిడ్డలు లేకుంటే ఈ వూరివారంతా నరకంలో కూలిపోతారా? నాబాధ వీరందరికీ ఎందుకు? ఎవరికర్మం వారిది. ఇక్కడచేరే

అమ్మలక్కలందరికీ ఇదే ఊసూ! తాము కంటూన్నది చాలదు కాబోలు? దుఃఖంఆగక కన్నీటిచుక్కలు రాలాయి.-తాను గొడ్రాలనికాదు.-వీరంతా చట్రాళ్లని! మూర్ఖులని! వారందరినీ మింగేయాలన్నంత కోపం వచ్చేది. కాని పైకేమీ చలించక మామూలుగా ఉండేది కాంతం.

క్రమంగా తల్లిబోధన తలకెక్కింది దత్తుకు! ఆమెచేసిన సిద్ధాంతం నమ్మాడు. కాంతం గొడ్రాలు! తల్లి బలవంతం చేస్తూంది, ఇంకో అమ్మాయినిచూచి చేసికోమని! ముచ్చటగా కాపరంచేస్తూ యిన్నాళ్లూ ఆమెవల్ల అన్ని సౌఖ్యాలు పొందుతూ ఆమెను విడిచి యింకొక భార్యను తెచ్చుకోవటమా? కానిచో యీ తీరని లోపం?

తల్లిపట్టుదల బలవంతమయింది. అప్పుడే పెద్దపెద్దవాళ్లీ కబురుతెలిసి పెద్ద కట్నాలిచ్చి పెరిగిన పిల్లల్నిస్తామని చెప్పవస్తున్నారు. వరలక్ష్మి మానసోద్రేకం పట్టతరంకాకుండా ఉంది. కాంతాన్ని ఆపాళంగా వెళ్లగొట్టి కోరిన కోడల్ని తెచ్చుకొని సంపదనుభవిద్దామని ఉంది ఆమెకు. కాంతం ఆమె ఊహల కన్నిటికి అడ్డుగాఉంది.

కాని దత్తుమాత్రం కాంతంతో తల్లినీ ప్రసంగం తేనీయలేదు. తానే నెమ్మదిగా ఆమెకు తెలియజేయాలని. అత్తగారు ధాటీగా యీకాస్త శుభవర్తమానం ఆమె చెవినివేస్తే ఆమెగుండె పగులుతుందేమో! కాంతం చాలా తెలివైనపిల్ల, పాపం!

ఆరోజు ఆఫీసుకి శలవు. దత్తు భోజనానంతరం తల్లి వీధిసావడిలో గ్రామస్త్రీలసభ నలంకరించే సమయం కనిపెట్టి కాంతాన్ని దగ్గరకు రమ్మన్నాడు. కాంతం ఎంతో ప్రేమగావచ్చి భర్తపాదాల చేరువగా కూర్చుంది ఆకులందిస్తూ. 'కాంతం, మనకెన్నాళ్లీ బిడ్డలులేని కాపరం! ఇంట్లో నువ్వూనేనే పసిబిడ్డలం ఎల్లకాలమూ!' అన్నాడు కాస్త నవ్వుతాలుగా. కాంతానికి మొదట సిగ్గు ముంచేసింది. వెంటనే గుండెలో రాయి పడింది. భర్తకూడా తన్నుగురించి ఏమి భావిస్తున్నాడో! నోరెత్తలేకపోయింది దిగ్భ్రమతో!

'చూడు! మనింటినిండా పాడీపంటా! అన్ని వైభవాలూ యిలా వృధగా పోవటమేనా? నీకే పిల్లలుంటే ఎంత నిండుగా నుండును! ఆప్రాప్తిలేకుంటే మనకీ జన్మకెంత విచారం! నాతల్లీ తండ్రీ ఎన్నాళ్లు సహించగలరు? నే నెన్నాళ్లు సహించగలను?'

కాంతం యింతవరకూ సహించ గలిగింది. మనసులో ఒకవిధమైన ఆందోళన బయలుదేరింది. దాంతో ఒకక్రొత్తధైర్యం వచ్చింది. ఇన్నాళ్లూ తనకిశోర హృదయంలో మననం చేసుకుంటూఉన్న వాదనలన్నీ ఒక్కసారిగా ఒకదానొన్నకటి తోసుకుంటూ ముందుకు వచ్చాయి. పెదవులల్లాడాయి:

'మీరుకూడా యిలాగంటారని అనుకోలేదు! నేనేంచేసేది? ఎవరి అదృష్టం వారిది. నాకేమైన బిడ్డలు కలగడం యిష్టంలేదనా? ఇది నాచేతులోపనా? నా మనసు కెందుకిలా బాధ కలిగిస్తారు?...'దుఃఖోద్రేకంచేత గొంతు తడబడి ఆగింది.

'అదికాదు నేననేది. నిన్నేమీ అనను. నీకు కలగకపోయినా ఇంకొక భార్యకు కలుగుదురు. అందుకోరకు....'

కాంతానికి ఒక్కసారి ఆకాశం విరిగి శిరసున పడింది. ఆ నీలిమాకాశ నిబిడ గర్భంలో ఒదిగి యున్న ఉరుమని పిడుగామెకు గూఢంగా వినిపించింది. తన పాదాలక్రింద నేల పరుగిడుతూ వున్నట్లయింది. ఇక పట్టలేకపోయింది. వీరావేశం ధరించింది. రౌద్రరూపధారిణియైన శక్తి స్వరూపం అమరింది.

ప్రకృతి సౌందర్యదేవత! చెలరేగిందా రౌద్రరూపిణి. పిడుగులు కురిపించగలదు. భూకంపం పుట్టించగలదు. ఉప్పెన పెట్టగలదు. ఊళ్లెగురవేయగలదు. ప్రపంచమంతా భస్మం చేయగలదు.

'మీ దురుద్దేశం నాకిప్పుడర్థమైంది! నేను గొడ్రాలినా! నన్నువిడిచి యింకోముద్దరాలిని తెచ్చు కుంటారా? నన్నేగంగలో కలుపుతారు? బిడ్డలులేని బాధ సహించగలను కాని యింత నిరాదరణ, యింత అవమానం, యింత కళంకం సహించగలనా? ఈ దురూహ మీకు పుట్టినదికాదు. మీ తల్లిది. కానిండు. ఇందు నాదోషమేమిటి? మగవారు కాబట్టి నోటికి వచ్చినమాట ఆలోచనలేక అన్నారు కాని జ్ఞానముపయో గించిన యింత అన్యాయం ఉండదు'.........ఏమేమో చెప్పబోయింది. నోరు తిరిగిందికాదు. భోరున ఏడ్చింది.

హిందూస్త్రీ ఎన్నికష్టములైనా, ఎన్ని క్లేశములైనా, ఎన్ని నిందలైనా ఓర్చి భగవంతునిపై భారంవైచి సహిస్తూ శుభదినముల కెదురు చూస్తుంది.

ఆమె మాటల్లో ఏదో దత్తు మనస్సున చురుక్కున నాటింది. అతని ముఖంలో మూర్ఖ స్వభావం గోచరించింది. ఆ ఉద్రేకంతో అతడు ఎదుటివ్యక్తి మనోస్థితి గుర్తించనేరక 'సరే నేనూ చూస్తా. నాతల్లి మాట నాకు అవశ్యం చేయవలసిందే! ఆమె నాకింకొక పిల్లను పెండ్లిచేయ నిశ్చయించింది. నీ విక్కడ నుండుటకు నా కభ్యంతరంలేదు. తరవాత నీయిష్టం'అని దిగ్గనలేచి గది గుమ్మంలోపలికి వచ్చాడు.

అంతలోనే వరలక్ష్మమ్మ గబగబా లో గుమ్మంలోనుండి 'నాయనా! నాన్నగారు కాబోలు రాశారు. చదువు' అంటూ ఒకఉత్తరం పట్టుకవచ్చి దత్తుచేతికిచ్చింది. కోడలు కాంతంవేపొక చూపు శరపాతంగా విసిరింది. ఆమె వైఖరిచూచి అంతా గ్రహించి మనస్సులో ఉప్పొంగిపోతూంది!

కొంప మునిగింది! నాన్నగారికి వ్యాపారంలో పెద్దనష్టం కలిగి కుదేలయిందట! 'పదిహేను వేలకుపైగా అప్పులు ఆ వూళ్లోనే ఉన్నవి. కనుక ప్రస్తుతం నేనావూరు వస్తే బాకీదార్ల చేతులోపడి బాధ పడవలసివస్తుంది. ఇంటిమీద వారెలాగా జప్తుపెట్టెదరు. మీరెలాగైనా ఆవూరు వదలిపోవలెను. లేకపోతే పెట్టేబేడకూడా దక్కదు.' దత్తు చదువుతూ కన్నీళ్లు కమ్మి కమ్మజారవిడిచి కూలబడ్డాడు. వరలక్ష్మి నడుంవిరిగి హోరున రోదన ప్రారంభించింది. కాంతం తనవిచారం మరచి తెలివితెచ్చుకొని అత్తను భర్తను ఓదార్చటం మొదలుపెట్టింది.

తల్లీ, కొడుకూ, కోడలూ పొన్నూరు చేరుకున్నారు. కాని అంతకుముందే ఇల్లంతా జప్తయింది. కుటుంబం కట్టుబట్టలతో బయటకు నడిచారు పాపం! ఒక చిన్నకొంపలో కష్టంగా కాలక్షేపం జరుగు తూంది. అత్తగారిపైన ఆవంతైనా మనసులో పెట్టుకొనక, కష్టకాలంలో, ఆమెకు, భర్తకు అన్ని ఉప చారాలు చేస్తూంది కాంతం! కామశాస్త్రి ఒకనాడు రహస్యంగావచ్చి అందర్నీ కలుసుకొని జరిగిన దానికి

మొత్తుకొని ఏడ్చాడు. ఇంక యిక్కడనుండీ లాభంలేదు. తానూ కాశీ పోతానన్నాడు. భర్తతోకూడా వరలక్ష్మి తానూ వెళ్తానంది. సరే ముసలిదంపతు లిద్దరూ ఆ అవమానం కప్పుకోనేందుకు, కొడుకూ కోడల్నీ దీవించి కాశీ పోయారు.

దత్తుకి దినం జరగటం కష్టమైపోయింది. కాంతం వానికెన్నోవిధాల పరిచర్యచేస్తూ ఉన్నదానితో తాను పస్తున్నా వానికి కష్టం కనపడనిచ్చేదికాదు. ఎంతో ఉత్సాహంగ మాట్లాడి ఎన్నో సుళువులుచెప్పి ఏలాగైనా ఏకూలైనా సంపాదించమని ప్రోద్బలంచేసింది. అతడూ ప్రయత్నిస్తున్నాడు. ఈలోగా తాను పొరుగింటి ప్లీడరుగారి అమ్మాయికి తమ యింటివద్దనే చదువుచెప్తూ వారాదరంగా యిచ్చే 15 రూపాయిల తోనూ భర్తకు ఏవిధమైన లోపంలేకుండా చేసేది.

దత్తు ఆయూరి బట్టల మిల్లులో కూలీగా ప్రవేశించాడు. పెద్దచదువు లేకపోవటంచేత పెద్ద ఉద్యోగం ఏదీ దొరకిందికాదు. రోజల్లా కష్టపడి యింటికివచ్చేసరికి నవ్వుముఖంతో ఎదురుగావచ్చి కాంతం వాని శ్రమంతా తీర్చేసేది. కాయక్లేశం చేత దత్తుకి మంచి ఆరోగ్యం కుదిరింది. ఉదయం మిల్లు గొట్టము కూసేవేళకే కాల్యాలన్నీ తీర్చుకొని భార్య కట్టియుంచిన భోజనం పట్టుకొనిపోయి సాయంకాల మయేసరికి యిల్లు చేరుకోనటం దత్తుకి వాచీపనివలె నిత్యకృత్యం అయిపోయింది. దానితో దినదినం వాని శరీరం కండలు తేరి కాయశరీరం పడింది. కాంతం రోజల్లా కష్టపడి యింట్లోపనులన్నీ చేసి, పొరుగింటి పిల్లకి పాఠాలు నేర్పి, యింటిపనులు చూచుకుంటూ, యిల్లలంకరించేసరికి ఆమెకూ ఒక నూతనోత్సాహం, జవం, సత్వం ఏర్పడ్డాయి. ఏకూలైతేనేమి? భార్యాభర్తల అన్యోన్యానురాగానికి, సుఖజీవనానికీ ఆస్వల్ప జీవితమే మూలకందమైపోయింది. ఆపేద గృహానికి అంత ఆనందం, ఉత్సాహం, అలంకారం కల్పించింది కాంతం సౌమనస్యం, ఓర్పు, నిష్కల్మషభావం!

ప్రకృతి ప్రేమ స్వభావ! అడగి మడగి ఉండి కృషిచేసిన కొలదీ సస్యం యిస్తుంది-దివ్యకాంతు లను సృష్టిస్తుంది. పుష్పగంధం విరియిస్తుంది. కమ్మని పండ్లను కానుకలిస్తుంది. తేనెవాన కురియిస్తుంది. దత్తు కాంతాన్ని మరీ ప్రేమతో చూసేవాడు. కష్టించివచ్చిన భర్తను కాంతం మరింతగా ప్రేమించేది. కొన్నాళ్లకు కాంతం భగవత్కృపవల్ల గర్భం ధరించింది! మగశిశువు కలిగాడు. ఆ అబ్బాయి తల్లిసౌందర్యమంతా ఆ కిశోరరూపంలో ఇముడ్చేసుకొని ఆపేద గృహాని కలంకారదీపంగా వెలిగిపోతూ వున్నాడు. ఇద్దరి ప్రేమ బంధం మరింత దృఢపడినది.

తనతోడి మిల్లుకూలీలు పిల్లలతో వేగలేక ఎందుకీపిల్లలని ఏడ్చేవాళ్లని చూచాడు దత్తు. కాని తనకెందువల్లనో అలా అనిపించేది కాదు.

ఆ శిశుజనన నక్షత్రఫలమో, భగవద్విలాసమో కాని దత్తు చాకచక్యమునకు మెచ్చి మిల్లు మేనేజరు మెచ్చుకొని మెకానిక్‌గా 50 రూపాయిల ఉద్యోగం యిప్పించాడు!

# జాతిని ఆరోగ్యవంతముగ తయారుచేయుడు

## ఏకైక కుటుంబ పానీయము ఇండియన్ టీ



ఆమె నిజముగా ఉత్తమురాలయిన తల్లి! మీరు కూడ అట్లే మీ పిల్లలకు చిన్నతనమునుండియే, క్రమముతప్పక టీ త్రాగుటను అభ్యాసము చేసి, వారు దృఢకాయులుగను ఆరోగ్యవంతులుగను తయారగునట్లు చేయుడు. టీ రుచికరమయిన పానీయము ; యువకులు పెరుగుచుండుకాలమున వారికి టీలోని ఆరోగ్యకరము, ఉత్సాహకరము అయిన ఉత్తేజనగుణము అవసరము. మీ కుటుంబము వారికి టీ త్రాగుటను అభ్యాసము చేయుటవలన మీరు ఆరోగ్యవంతమయిన జాతిని తయారు చేసినవారగుదురు.

ఈ ప్రకటనను కత్తిరించి, మీ పేరు విలాసముతోకూడ, కలకత్తాలోని ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్‌పాన్షన్ బోర్డువారి ఇండియా కమీషనరుగారికి—పో. బా. నెం. 2172—పంపినయెడల మీకు ఉచితముగా "స్త్రీలు శ్రద్ధవహించినప్పుడు" అను సచిత్ర పుస్తకము యొక్క ఇంగ్లీషు ప్రతి నొకదానిని పంపుదురు. ఆ పుస్తకము కుటుంబ పానీయముగా టీకి గల అద్వితీయగుణములను మీకు విశదపరచును.

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్‌పాన్షన్ బోర్డువారిచే ప్రకటించబడినది 'I K 162'

# స్వాతంత్ర్యము – స్త్రీలు

## శ్రీ మూర్తి

భారతీయులు కుటుంబజీవనమునకు అలవాటుపడినవారు. ఈ కుటుంబమునకు భర్త అధికారి. భార్య అధికారిణి. ఆమె గృహిణి. అతను గృహస్థుడు. ఏ నాగరికత ప్రకారమైనా ఈ భార్యాభర్తలు (స్త్రీ పురుషులు) ఇద్దరూ స్వతంత్రులే. వీరిద్దరి జీవితపరమావధి ఒక్కటే. భారతదేశంలో ఈ స్త్రీ పురుషులిద్దరూ పవిత్ర వివాహసూత్రంచేత బంధింపబడి సమభాగులై కుటుంబజీవితాన్ని ఆనందమయంగా నిర్వహించుకుంటున్నారు.

ఈ విషయంలో పాశ్చాత్యుల తత్వం కొంతవేరు. కొందరు పాశ్చాత్య స్త్రీలు 'స్త్రీ ఒక పురుషునితో Sexual Happiness అనుభవిస్తూ, తనకు కలిగిన సంతానముయొక్క అభివృద్ధికై తానూ తన పిల్లలు ఆ పురుషునిపై ఆధారపడి, ఆ పురుషునికి బానిసలయి ఆజన్మాంతం కుటుంబజీవనము చెయ్యవలసిన అవసరము లేద'ని పురుషులతో పోటీగా వృత్తులకోసం విద్యల నభ్యసిస్తున్నారు. వారి జీవనోపాధి వారు సంపాదించుకుంటూ వారి కడుపున పుట్టిన పిల్లల అభివృద్ధికి వారే బాధ్యులైవుంటున్నారు. కుటుంబజీవనములోని గృహ నిర్వహణమును జరుపుకుంటూ సారస్వతోపాసన కళారాధన చేయుచున్న తమ భర్తలకు చేయూతనిస్తూ దేశ ఔన్నత్యానికి పాటుపడుచున్న భారత నారీమణులను అనాగరికులని భావిస్తున్న పాశ్చాత్యస్త్రీలు కొందరు గలరు.

'భర్త కొట్టిన తగాదాలేదికన్, తోడికోడలు దెప్పంగ మహాభిమానినై...' కొందరు భారతీయులు సంపూర్ణ స్త్రీ స్వాతంత్ర్యం అవసరమని, స్త్రీలను పురుషులవలె వృత్తులు - జీవికకోసమే పాశ్చాత్యవిద్యల నభ్యసించాలని ఆందోళన ప్రారంభించారు. కేవలం పిల్లలినికనే యంత్రాలు కాకపోయినా, పిల్లలిని కని పెంచి, పెద్దవారిని చెయ్యవలసిన విధి స్త్రీదే కదా! ఆ విధిని ఒక పురుషునికి భార్య అయి, ఒక గృహానికి గృహిణి అయి నెరవేర్చుకుంటూ, తమ భర్తలతో సమానమైన స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ, కుటుంబజీవనము చేయుచున్న నారీమణులను, భారతీయ నాగరికతను నిరసించి, నేటి యువతులు కొందరు పాశ్చాత్య నాగరికతా పద్ధతులను ఇమిటేషనుగా అభ్యసిస్తున్నారు.

కొందరు స్వతంత్రంగా విహరించి ఆత్మగౌరవాన్ని పాతివ్రత్యాన్ని కోలుపోతున్నారు. కొందరు అచిరకాలములోనే తమకు సర్వోత్తమమైన స్థానం పతి సామీప్యాన్నే, పతి గృహాన్నే వుందని గ్రహించినా ఆనాడు కుటుంబజీవనములో ఆమె నిర్వర్తించవలసిన విధిని గుర్తించలేకపోతున్నారు. గృహలక్ష్మి పొందవలసిన గౌరవాన్ని పొందలేకపోతోంది.

ఈ ధోరణినుండి తప్పించి నేటి భారతీయ యువతులకు అవసరమైన విద్యను నేర్పుటకై కొందరు మహాత్ములు అనేక నూతన ప్రణాళికలను స్థాపించారు. కాని పాశ్చాత్యవిద్యలు ఆకర్షించినట్లు ఈ భారతీయ విద్యలు నేటి యువతులను ఆకర్షించలేకపోయాయి.

కేవల పాశ్చాత్యవిద్యల నభ్యసించి విజాతీయ తత్వమునకు లోనుకాకుండాను, నశించిపోతున్న భారతీయ నాగరికత నుద్ధరించుటకును రవీంద్రుడు ప్రాక్పశ్చిమ నాగరికతలను సమన్వయపరచి 'విశ్వభారతి'ని స్థాపించాడు. ఈనాడు ఈ విశ్వభారతి ప్రచారానికై తన ఆస్తికలను సైతమూ శాంతి నికేతనానికి అర్పించి తాను (Spirit) విశ్వవిహారి (సూర్యుడు)తో ఐక్యంచెంది విశ్వవిహారం చేస్తున్నాడు. తిరిగి ఏనాడో విశ్వ విజేతఅయి వెలియకపోడు!

స్త్రీ స్వాతంత్ర్యం కోరే స్త్రీలు అందరూ ఈ భారతీయ విద్యలను, ఈ విశ్వభారతి విద్యను అవలంబిస్తే ఆ స్త్రీల స్వాతంత్ర్యం సద్వినియోగమవుతుంది. అప్పుడే భారతీయ నాగరికత, భారతజాతీయత నిలబడుతుంది.

దీన్ని గుర్తించిననాడు భారతీయులు భారతమాతను దాస్య శృంఖలాలనుంచి విముక్తి పొందించి ఐక్యకంఠంతో గానం చెయ్యకలరు.

# భారతవనితలు*

శ్రీ వంక వెంకట రామకృష్ణారావుగారు



భారతవనితల యాదర్శములను దెలిపెదను. భారతదేశమున నాదర్శవనిత మాతయే. వనిత యనగానే భారతీయుని మానసికనేత్రమునకు మాతృస్వరూప మగపడును. పాశ్చాత్యులకో యాదర్శవనిత భార్యయే. పశ్చిమమున గృహమందలి యధికారమంతయు భార్యదే. కాని మన దేశముననో మాతయానతి నెవ్వరును మీరరాదు.

భారతవనితకు భార్యకుండవలసిన హక్కులు లేవని కొందరు ఈసడించవచ్చును. అందుకు భారతీయుడీవిధముగా జక్కని సమాధానమిచ్చును. 'ఓపాశ్చాత్యులారా! ఈసడింపుల దగ్గింపుడు. మీదేశమున పవిత్ర మాతృస్వరూపమేదీ? మిమ్ములను నవమాసములు మోసి, కని, పెంచిన ప్రేమమూర్తికి మీరుచేయు పూజయేది? మీకొఱకై యిరువది మారులైన జావనిచ్చగించు మీతల్లిని మీరెచ్చట నుంచుచున్నారు?' పాశ్చాత్యులలో మాత పవిత్రతనెవ్వరును గుర్తించినట్లు కనబడుటలేదు. ఇది యెంతవరకు వచ్చినదనిన, అమ్మా! యని సంబోధించినచో నమెరికను వనిత లాశ్చర్య పడునంతవరకు వచ్చినది!

భారతీయుడు గృహమునగల సర్వాధికారమును దల్లికీయ సిద్ధపడునుగాని భార్యకీయజాలడు. భార్యకూడ మాత యయినంతనే యామెనుగూడ భర్తయు, సంఘమును బువ్వులలోబెట్టి పూజింతురు. ఆసమయమువఱకు నామె మాత కడగియుండవలసినదే.

మాత నిట్లెందులకు బూజింపవలయునని అడుగవచ్చును. ఎందులకా? ఆమె నైర్మల్యము యొక్క మూర్తి గనుక. తన నైర్మల్య సంరక్షణార్థము భారతదేశపు వనిత యెన్నో పడరాని శ్రమల నోపికతో నోర్చుకొనును.

వర్ణాశ్రమధర్మములను జూచి పలువురు పాశ్చాత్య ప్రబుద్ధులు పలువిధములగు వ్రాతల వ్రాసి తమ తెలివితక్కువను ప్రదర్శించిరి. పాశ్చాత్యులకు వ్యక్తిత్వమెక్కువ. స్వతంత్ర బుద్ధి హెచ్చు. 'నేనీపని చేయుదును,' అని పాశ్చాత్యుడనును. ఎందులకని ప్రశ్నించిన 'నాయిష్టము గనుక' అని జవాబిచ్చును. హిందూసంఘమున నట్టిది పనికిరాదు. వ్యక్తులు సంఘక్షేమమునకై తమతమ సౌఖ్యములను తగ్గించుకొన సిద్ధపడి యుండవలెను. 'నా యిష్టము' లెంతమాత్రమును బనికిరావు.

హైందవ జాతియొక్క యాదర్శ మాత్మస్వాతంత్ర్యమే. ఈప్రపంచ మంతయు నొకమిథ్య యని వారి తలంపు. ఈవేదాంతము భారతీయులందు జీర్ణించియున్నది. ఇది నేటికాలపు పశ్చిమదేశీయుల కొందఱి వెఱ్ఱివేదాంతమువంటిది కాదు. దీనిపునాది దిట్టమయినది. హిందువులెందఱెందఱు దేశస్థుల యౌన్నత్య పతనములనో జూచి నేర్చుకొనిన పాఠ మీవేదాంతము. భారతదేశ మన్ని యవస్థలను దాటిన వృద్ధుని వంటిది; పాశ్చాత్యులు శిశువువంటివారు. శిశువునకు దనకోరిక తీరినచో ప్రపంచమంతయు నానందమయమే

---

* శ్రీ వివేకానందస్వామి చికాగో యుపన్యాసమునుండి.

యనిపించును. పాశ్చాత్యులు నేడు కొంచెము ధనికులుగా నున్నందున 'దారిద్ర్యదేశమైన' భారతదేశముపై గ్రిందిచూపు చూచుచున్నారు. కాని భారతదేశమేమియు బ్రతీకారము సేయదు. అర్థవంతమగు బోసినవ్వొకటి నవ్వుచున్నది. దానియందలి యర్థ మీా శిశుతుల్యమగు పశ్చిమఖండమున కేమి తెలియును? భారతదేశము 'వెఱ్ఱివాడా! ఎట్టిజాతులు నశించిపోయినవో తెలిసికొన కున్నావే? అన్నివిషయములలో మీా తలదాటి పోయిన గ్రీసుగతి యేమైనది? అట్టిదేయగు రోముమాటయేమి? మిమ్ము గడగడలాడించిన స్పెయిను ప్రస్తుత హైన్యదశయైనను నీజ్ఞాననేత్రమును దెరువదే?' అని పాశ్చాత్యునితో ననుచున్నది. కాని ధనమదమెక్కియున్న పాశ్చాత్యులీ 'వేదాంతము' నకు లొంగుదు రనుకొనుట పిచ్చి.

వేలకువేల యేండ్ల యనుభవములబట్టి భారతదేశము నేర్చుకొనిన యమూల్యమగు పాఠ సార మిది. దైవానుగ్రహము, నమ్రమానవునకు, అనగా నీప్రపంచమంతయు నొకనీటిబుడగ వంటిదనియు, నీప్రపంచమునుండి యెంతశీఘ్రముగా దప్పుకొనిన నంతమంచిదనియు, నిచ్చట ననవసరముగా మిట్టిమిడిసి పడుట వివేకము గాదనియు నెరిగినవానికి, లభించునుగాని మదించి తనవలననే యీప్రపంచము నిలచియున్నదని దురభిమాన పూరితుడగువానికి గాదని భారతదేశము గ్రహించినది. అందువలననే యెన్నియాపదలనైనను నోర్పుతో ననుభవించుటలో యావత్ప్రపంచమునకును హైందవు డాదర్శప్రాయుడగుచున్నాడు. హైందవుల యీ 'వేదాంతమే' వారి సాంఘిక వ్యవహారములంతటియందును బ్రతిఫలించుచుండును. సహనమునకు భారతస్త్రీ లాదర్శ ప్రాయలుగ నుండుటకును నిదియే కారణమని వేరుగా జెప్పనక్కరలేదు.

# స్మశానము

నాకు రమణీయమీా స్మశానమ్ము-యిందె
పాడుకొందును నా మనోవ్యథల నెల్ల
తరుణ రక్తంబు ద్రావి నర్తనముసేయు
భూతజాలంబు కన్నులు పులకరింప

పూడుకొన్నట్టి యీా తలపుఱ్ఱెలందు
నా భవిష్యత్తు జిత్రించినార లెవరొ
తడని చూచి నీలాకాశదర్పణమున
వ్రాసికొందును బ్రతుకులో పాటలెల్ల

ఆకు గదలాడనట్టి యీా యధ్వమందు
నేన సామ్రాజ్యశాలి నైనాను కాని
నా వలెనె నవ్వియుం డొకనాట నిచియు
పూడిపోయిన నాతలపుఱ్ఱె జూచి

గడచియున్న యసంఖ్యాకగాధలెల్ల
జ్ఞప్తి కెలయించుచున్న వీ సమయమందు
నాకు రమణీయ మీా స్మశానమ్ము యిందె
పాడుకొందును నా మనోవ్యథల నెల్ల.

—ఆర్. సుబ్బమ్మ.

# అనాథ

శ్రీ ఆకెళ్ల రామబ్రహ్మశాస్త్రిగారు

'ఏమండి, అమ్మాయికి యుక్తవయస్సు వచ్చిందిగదా. ఈ సంవత్సరంతో మెట్రిక్యులేషన్ పూర్తి అవుతుంది. పెండ్లిచేసి ఓ యింటిదానిని చేయుట మంచిదిగాదా.'

'అవును. ఆ సంగతే నేనూ అనుకుంటూన్నాను. విద్యాభూషణునకు యుక్తవయస్సు వచ్చింది. ప్రాక్టీసు ఆరంభించేడు. మంచి తెలివైనవాడని, వృద్ధిలోకి రాగలడని నిన్ననే జడ్జిగారు బహుగొప్పగా పొగిడి 'మీ అబ్బాయా?' అని నన్నుఅడిగేరు. అప్పుడు, మనవాడుకాదని, అసలు వృత్తాంతమంతా చెప్పేను.'

విద్యాభూషణుడు తనగదిలో కూర్చొని మర్నాడు తీర్పుచెప్పబోయే తన పార్టీ దావాకై లా పుస్తకాలు తిరగవేస్తున్నాడు. ప్రక్కగదిలోని ఆ దంపతుల కబుర్లు విద్యాభూషణుని ఆకర్షించేయి. పుస్తకం మూసేసి జాగరూకతతో విన్నాడు. తనచెవుల తానే నమ్మలేకపోయేడు. తను విన్నది మరల మరల తర్కించుకొనుచుండగా బర్రున గదితలుపు చప్పుడైంది. అదిరిపడి వెనక్కి చూసేడు. 'విద్యాభూషన్! ఏమి అదరిపడ్డావు? అదేమి కలవరపడుచున్నావు?' అంది చదరంగమాడుకొనుటకు వచ్చిన లక్ష్మి.

'అబ్బే, ఏమీలేదు లక్ష్మీ! నేడు ఒంట్లో బాగుండలేదు. కొద్దిగ తలనొప్పిగా యుంది' అని సర్దుకున్నాడు. కాని సోదరప్రేమతో ఉపచర్యచేయుచున్న లక్ష్మిని చూడగానే విద్యాభూషణుడు ఆవేదనతో 'లక్ష్మీ! నేను నీ సహోదరుడను కాను. నా తల్లిదండ్రులెవరో వేరు. వారిని నేనే ఎరుగను...'

'విద్యాభూషన్! ఏమనుచున్నావు? కలవరిస్తున్నావా?' అంది మాటకడ్డంవచ్చి.

'లేదు. లక్ష్మీ! లేదు. కలవరించుటలేదు. యదార్థమే చెప్పుచుంటి. మీ అమ్మ, నాన్నగార్లు చెప్పుకుంటూంటే విన్నాను. యింకా విన్నాను. నీ వివాహముగురించి నిన్ను నా...నా...నా' అని తడబడ్డాడు.

ఆమాట వినగానే లక్ష్మి కంగారుపడుచు నిశ్చేష్టయై నిలువబడిపోయింది. 'లక్ష్మీ! భయపడెదవేల? నేను ఉన్మత్తుడను కాను. నన్ను నమ్ముము.'

'అమ్మ, నాన్నగార్లు ఎవరినిగురించి చెప్పుకుంటున్నారో! పరధ్యానంలో నీకలా వినబడవచ్చును. రేపు నిజము కనుకుంటా'నని చెప్పి లక్ష్మి తనగదిలోకి వెళ్లిపోయింది.

లక్ష్మి నిద్రబోవ ప్రయత్నించింది. కాని ఆలోచనాపరంపరలతో నిద్రరాలేదు. ఒక్కనాడు కూడ పరాకునైనా తన తల్లికాని, తండ్రికాని విద్యాభూషణుడు తన సోదరుడుకాదని చెప్పలేదే. యిప్పుడు విద్యాభూషణునకు తననిచ్చి వివాహముచేతురా? ఏమో! అజాగ్రతావస్థలో విద్యాభూషణుడు తన మనోవాంఛను తెలుపుచున్నాడా? ఛా! అదెన్నటికి కానేరదు. సోదరభావముతో సర్వదా ప్రేమించు విద్యాభూషణుడు నేడు యిట్లు మాట్లాడునా? ఏమీ పాలుపోవడంలేదు లక్ష్మికి.

తెల్లవారింది. లేచీ లేవడంతోనే తల్లినిచేరి 'అమ్మా! విద్యాభూషణుడు నాకు అన్నయ్య కాడుటే? నిన్నరాత్రి నాన్నగారు, మీరు చెప్పుకుంటూంటే విద్యాభూషణుడు విన్నాడుట.' యదార్థము

చెప్పుటా? మానుటా? యని తటపటాయిస్తూండగా పురుషోత్తమరావుగారాలా రావడంచూచి లక్ష్మి తల్లి పనియున్నట్లుగా చక్కాపోయింది. తల్లిదండ్రులు తనను తప్పించి తిరగడం లక్ష్మికి అనుమానంగానేయుంది. యింకా ఏమి విన్నాడో కనుకుందామని విద్యాభూషణుని గదిలోకి వెళ్ల ప్రయత్నించింది. కాని మునుపటి వలె చొరవగా వెళ్లుటకు సిగ్గుపడింది. యీడుజోడుగా యున్న విద్యాభూషణుడు తనప్రాణ విభుడగుట మనస్సున చాల ఆనందించింది. తక్కుతూ తారుతూ గదిలో ప్రవేశించి చదరంగంబల్ల దగ్గరకు లాక్కొని కూర్చుంది. ఆట ప్రారంభించేరు.

'లక్ష్మీ! ఎత్తువెయ్యి. చాలసేపు ఆలోచిస్తున్నావే ఈవేళ.'

'ఏముంది మీతో నే నాడగలనా?'

'ఓహో! మీ-మీ అంటూ మొదలెట్టేవు. సంగతేమి?' అన్నాడు మందహాసంతో.

ఆమాటతో లక్ష్మి కొక్కసారిగా ఒళ్ళంతా గగుర్పొడిచింది. విద్యాభూషణుని తలఎత్తి చూచుటకు సిగ్గుపడి గదిలోంచి పారిపోయింది.

మర్నాడు తనపార్టీ దావా హియరింగు అగుటచే విద్యాభూషణుడు కోర్టుకు వెళ్లేడు. తనపార్టీ తరఫునెగ్గింది. నెగ్గదనుకున్న దావా నెగ్గినందులకు తనపార్టీయే కాకుండ జడ్జీకూడ చాల ఆశ్చర్యపోయేడు. విద్యాభూషనుని తెలివి తేటలకు, సమయస్ఫూర్తికి అచ్చెరవొంది, జడ్జీ విద్యాభూషణుని తనయింటికి విందుకు తీసుకెళ్ళేడు. తన వృత్తాంతముగురించి పురుషోత్తమరావుగారేమి చెప్పిరో జడ్జీగారి నడుగుటకు సమయమునకై వేచియున్న విద్యాభూషణునకు నేడు వీలుచిక్కినది. విందు జరుగుతోంది. ఆ ప్రశంస ఎత్తేడు. తనువిన్నది ఆయనతో చెప్పి తన జీవితరహస్యమును ఆయన చెపుతూంటే వింటున్నాడు.

'పురుషోత్తమరావుగారు పాతిక సంవత్సరాలక్రితం భద్రాచలం తీర్థం వెళ్ళేరుట. ఆ సంవత్సరం శ్రీరామ కళ్యాణము చూచుటకై దేశ దేశాలనుంచి యాత్రికులు వచ్చేరుట. భద్రాచలం అతి కోలాహలంగా యుండట. శ్రీరామకళ్యాణము పూర్తయింది. మరునాడు ఎవరిఊళ్లకు వాళ్లు ప్రయాణం కట్టేస్తున్నారట. ఉదయముననే పురుషోత్తమరావుగారు గుళ్లోకిపోయి వస్తూంటే 'క్యారు, క్యారు' మని ఏడ్పువినబడి ఆ ధ్వనినిబట్టి వెళ్లిచూడగా గుడిమంటపముపై 10 నెలల మగశిశువు కనబడ్డాడుట. ఆ పిల్లవానిని చంకబెట్టుకొని కనబడ్డవారినెల్ల అడుగుతూ ఆరోజల్లా పిల్లవాని తల్లిదండ్రులకై వెదికేరుట. చివరకు 'నా' అనే వారెవరు లేకపోవుటచే పిల్లవానితో యింటికి వచ్చేసేరుట. వారికి అప్పటికి సంతానము లేకపోవుటచే ఆపిల్లవాడు తమకు శ్రీరామ ప్రసాదమని యెంచి అతిగారాబాగా పెంచుచుండిరి. తర్వాత 4, 5 సంవత్సరాలకు వారికో ఆడపిల్ల గల్గింది. ఆపిల్లకు లక్ష్మియని నామకరణంచేసి అల్లారుముద్దుగా పెంచుచుండేవారు. 'విద్యాభూషన్! నీవేసుమా భద్రాచలంలో లభించిన పిల్లవాడవు. పురుషోత్తమరావుగారే నీకీ సంగతిచెప్పి, లక్ష్మిని నీకు వివాహముచేయ సంకల్పించుకున్నారు'

అప్పటికప్పుడే రాత్రి 9 గంటలగుటచే విద్యాభూషణుడు వారివద్ద సెలవుతీసుకొని యింటిదారి పట్టేడు. ఎంతసేపూ భద్రాచలరామమంటప వృత్తాంతమే తలలో తిరుగుతోంది. తనతల్లి ఏవేశ్యయో లేక ఏ పూర్వసువాసినో తప్పత్రోవలబోయి, తన నచ్చోట వదలి పోయిందేమో యని ఆలోచనలో పడ్డాడు. నెమ్మదిగా గోదావరీ యొడ్డు దగ్గరకొచ్చుసరికి 'బుడ, బుడ' మను శబ్దము వినబడి చూచుసరికి నీటిపై మునుగుతూ తేలుతూయున్న స్త్రీ శరీరం కనబడింది. గబాలున నదిలోఉరికి ఈతవచ్చిన వాడగుటచే ఆమెను ఒడ్డుకు లాక్కొచ్చి డాక్టరు సహితంగా యిల్లుచేరేడు. మర్నాటికి ఆమెకు మాట్లాడుటకు ఓపికగల్గింది. తన

కుపచర్యచేయుచున్న లక్ష్మి, విద్యాభూషణుల తేరిపార చూసింది. విద్యాభూషణుని చూచుసరికి అంతరాత్మ ఏదో చెపుతున్నట్లుగా అయింది. మాతృగర్భం పీకులాడింది. తన కుమారుని పోలికలు గన్పట్టేయి. కాని పైకి చెప్పలేకపోయింది. భాగ్యవంతుల యింట్లోవారిని తన బిడ్డడని ఎట్లు అనగలదు? ఆమె ముఖవర్చస్సు మారుట, కలతచెందుట విద్యాభూషణుడు గ్రహించి 'ఏమమ్మా! అలా తహ తహ లాడుచుంటి'వని అప్రయత్నంగా సంబోధించేడు. ఆ సమయానికే పురుషోత్తమరావుగారుకూడ వచ్చేరు. అందరు ఆమె మంచం చుట్టు కూర్చున్నారు.

'నాయనలారా! ఈ దిక్కుమాలిన దానిని ఏల బ్రతికించితిరి, చచ్చిపోదామన్నా చావనీయరా? నిన్నటినుంచి నా దుఃఖసాగర మింకిపోయిందనుకున్నాను' అని కంటనీరు పెట్టుకోడం ప్రారంభించింది. పురుషోత్తమరావుగారామెను ఓదార్చి 'మీ రెవరో సద్వంశ సంజాతులవలె నగపడుచున్నారు. బ్రతుకుపై మీకింత నిరుత్సాహమేల?' యని యడిగెను.

'అయ్యా! ఏమని చెప్పకొనను? నేనొక బ్రాహ్మణపడతిని. రాజోలు కాపరస్తులగు బులుసు వెంకటప్పయ్యగారికి నేను ప్రథమ కళత్రమును. మాకు మొదటి పదివత్సరములవరకు సంతానము లేకపోయింది. పున్నామనరకము సంభవించునేమో యని విచారించి మావారు నా అనుమతి వడసి ద్వితీయ కళత్రమును బడసిరి. ఆ వివాహమైన రెండు సంవత్సరములకు ఏమిమాయమో కాని నేను గర్భవతినైతిని. మగబిడ్డను కంటిని. నా సవతికూడ మూడుమాసములెచ్చు తగ్గుగా ఆడపిల్లను కన్నది. అక్కచెల్లండ్రులాయుండేది, అది మొదలు నాసవతికి నాపై మచ్చరముగల్గింది. మాదికొంచెం గొప్పఆస్తియనే చెప్పవచ్చు. అది అంతయు నాకుమారునికే ముట్టుననియు, మా భర్త ఏక్షణములో హరీయందురో అనే దుష్టబుద్ధితోయుండేది. ఆయనకు పూర్తిగా 50 సంవత్సరాలు నిండలేదు సుమండీ. ఉక్కులాంటిమనిషి. ఆస్తి ఆమెపేర వ్రాయమని నాసవతి ఆయనను ప్రతిరాత్రి పోరుపెడుతూనే యుండేది. ఈలా రోజులు జరుగుతుండేవి.

'ఆసంవత్సరం శ్రీరామ కళ్యాణానికి మావారు భద్రాచలం ప్రయాణమన్నారు. చంటిపిల్లల తీసికొని తీర్థమేమిటని నేనెంత చెప్పినను, మావారి పట్టుదలమీద అందరం బయలుదేరేము. భద్రాచలం చేరుకున్నాము. ఒకయింట తలదాచుకొని, పిల్లకూనలచంక బెట్టుకొని ఎట్లో శ్రీరామదర్శనం చేసేము. ఆరాత్రితో మహోత్సవం పూర్తిఅయింది. మేము మరునాడు ఉదయం బయలుదేరు లాంచీపై ప్రయాణంకట్టేము, ఉదయాన్నే స్నానంచేసి శ్రీరామదర్శనం చేసుకుపోదామని తలంచి, పిల్లలతో మా యిద్దరినొక్కసారి తీసుకవెళ్లిన కష్టమని మావారు మొదట నాసవతిని తీసుకొని వెళ్లేరు. వారు తిరిగివచ్చినతర్వాత నాబిడ్డను నాసవతి కప్పగించి మేమూ వెళ్లేము. శ్రీరామదర్శనం చేసుకొని తడిబట్టలతో గోదావరి తీరాన్ని వస్తూంటే వెనక్కాలే నా సవతి వచ్చి 'అయ్యో! పొద్దుపోలేదా? యింకా నెమ్మదిగా వస్తున్నారు. లాంచీ వదిలేస్తాడు రండి, రండి. కూలివాడు సామాన్లు తెస్తున్నాడు' అంటూ మమ్మల తిన్నగా లాంచీదగ్గరకు తీసుకుపోయింది. సామాన్లు లాంచీలోపెట్టించి 'అక్కా! చప్పు చప్పనఎక్కు' అని నన్ను తొందరపెట్టింది. హడావిడిలో మేము లాంచీ ఎక్కేసేము. పిల్లల నిద్దరిని ఒకచో పరుండబెట్టి యుంటుంది గదా యని నేను లాంచీమీద తడిబట్టలు ఆరవేసుకుంటూ చాలసేపు గడిపేను. అప్పటి కప్పుడే రెండుజాముల ప్రొద్దెక్కింది. పిల్లాడికి పాలవేళయిందని నా సవితియున్నచోటుకు వెళ్లి చూచుసరికి నా బిడ్డడు కనబడలేదు. నలుదిక్కులా చూసేను. ఎచ్చటాలేదు; నా సవితిపిల్లమాత్రముంది. 'చెల్లీ, అబ్బాయిఏడే?' యని అడిగేను.



(వెనుకటి తరువాయి)

భూషణము! భూషణము!
ఏమి భూషణము?
ఇల్లాలు భూషణము!
ఇల్లు భూషణము!
ఇల్లాలు జచ్చినా
ఇల్లు గాలినా
కోటలు గలరాజు
కోలుకోలేడు!

సహజం అయిన మాతృహృదయం ఇందు వ్యక్తీకరింప బడుతుంది:—

అరుగుమీదా నాతండ్రి
అలిగి పడుకుంటె
చిక్కుడువ్వైన తోటి
చిక్క నే దీతు.
పాపడి చేతికీ
బంతి నిస్తేను
పనివిడిచి నేజూతు
పాప డాటల్లు.
ఊరల్ల మొగ్గల్లు
నోరల్ల పళ్ళు
మాయయ్య దివిటీలు
రవ్వల్ల సురటీలు.
పెద్దల్లనాటి దీ
ముద్ద బంగారమ్మ
చెడగొట్టు కంసాలి
పాపడం దెలకు.
వీధి వీధులవారు
విన్నారా? లేదా?
నిత్య సిరి మా బాల
ముద్దు మాటల్లు.
నిద్ర వచ్చిందమ్మ
నీలి కళ్ళకు,
బద్దె పలుపులు దేర
నిద్రల్లు దెలువ.
కన్న కానుపంత
కడుచక్క నుంటె
కన్నుల పండుగే
కన్న తల్లికి.

చిట్టడుగు పొట్టడుగు కావల్లెనని
శివుడు మాకిచ్చాడు చిన్న బిడ్డలను
వారికీ అన్నమ్మ కావల్లెనని
వరలక్ష్మి మాకిచ్చె ధాన్యరాసులను
తల్లడీ తల్లడీ ఏమి తల్లడీ
మాకొడుకు రామయ్య వళ్ళంతా పైడి.

వాత్సల్యాన్ని వ్యక్తీకరించేవి స్త్రీలవద్ద యెన్నో ఉంటాయి.

చుట్ట పక్కాలను గురించి యింత చక్కగా వర్ణించి ఉన్నవి అరుదుగానే కనబడతాయి.

చుట్టాలు పక్కాలు కలిమిలోవారు
కలిమి దప్పినాక కల్లోనే లేరు

లోకులను నమ్మి చెడిన ఒకామె తన అనుభవంతో మేళగించి యీ తీరున పాడుకొంటుంది:—

వడ్డుదంచిన మరి
ఓపికా జెడును
ప్రజల నమ్మినవారి
బ్రదుకంతా జెడును

చూడకా ఆడేరు
చూచి ఆడేరు
కానకా ఆడేరు
కల్లలీ ప్రజలు

పాటల్లు బాడితే పలవలంటారు
పాడకుంటే జనులు మూగలంటారు

అత్తింటికి వెళ్ళే తన కూతురుకు తల్లి యేరకంగా లోకంలో నడుచుకోవలసింది సలహాయిస్తుందో చూడండి:—

నారికాముఖాన నవ్వనేరిస్తే
నాతి నీకూరంత చుట్టాలె సుమ్మా
పలువరుస చక్కగా పలుకనేరిస్తే
ఊరంత చుట్టాలె నాతల్లి నీకు
పెద్దింటికెళ్ళేవు బుద్ధులెటిగేవు
వడ్డించె తల్లెనుక వరుసలడిగేవు

యంత్రయుగం రాకముందు జమీందారీ సమాజంలో రాటానికీ, చేమగ్గానికీ ఆర్థికంగా ఉన్న విలువ యెంతో బోధపడుతూంది యీ పదాల్లో:—

ఏకులొడికినవారు వేలసంపన్నులు
ఏకులే లొడకవే ఎలగోపిదేవి?
సాలేడి మగాన చల్లకవ్వాన
దాగుండు సిరిలక్ష్మి ద్వారబంధాన
సన్ననీ నూలొడికి చిన్నన్నకిస్తే
చిన్నన్న నాకొక్క చీర నిచ్చాడు

నిద్రబోయేవారిని గురించి హాస్యానికైనా గావచ్చు, వడికి వడికి విసుగుతో గావచ్చు, యంత్రయుగంలో గిట్టక గావచ్చు:—

ఏకుల్లు వడికితే ఏక దరిద్రమ్మె
పడుకొని నిదరోతె పరమగతి కద్దు.

(ఇవన్నీ మా నాయనమ్మ పాడినవే.) (సశేషము)

# మేరీ క్యూరీ సతి

★

శ్రీమతి మైదవోలు పద్మావతిదేవిగారు

★

నేడు వ్రణచికిత్సకు సర్వసామాన్యముగ రేడియమ్‌ను వాడుచున్నారు. పలుమారు 'రేడియమ్ క్యూర్' యను పదమును మనము వినుచున్నాము. కాని రేడియమనగా ఏమి? దానిని కనిపెట్టినది ఎవరు? ఏ కొందరికో తప్ప అందరికి ఆ విషయము తెలియదు. అది విపులముగ తెలియచేయుటే ఈ వ్యాసపు ముఖ్యోద్దేశము.

రేడియమ్ యనునది వొక వెలగల లోహము. ఇది చీకటిలో తళతళలాడును. ఒక గ్రామ్ రేడియమ్ విలువ నూరువేల డాలర్లు. రేడియమ్ దొరకుట చాలా యరుదు. ప్రపంచమందు ఇప్పటికి ఇంచుమించు ఇరువదిఎనిమిది ఔన్సుల రేడియమ్‌కన్న యెక్కువలేదు. రేడియమొక యపూర్వ పదార్థము. రేడియమ్ గుణతత్వములు, రేడియమ్ మహిమ, యిపుడు చాలామంది యనేకవిధములుగ చెప్పుచున్నారు. మహిమోపేతమగు ఈ రేడియమును తీయుటకు మహామహులు విశ్వప్రయత్నములు చేయుచునేయున్నారు. వైద్యులు రేడియమ్ వుపయోగమునుగురించి ఎన్నెన్నో వ్రాసినారు, వ్రాయుచున్నారు. కాని ఈ యపూర్వ పదార్థము ఆదిని యే వ్యక్తి కనిపెట్టినది, ఎపుడు ప్రచారములోనికి వచ్చినది యనునది ఇపుడు తెలియచేసెదను.

రేడియమ్ కనిపెట్టిన గౌరవము స్త్రీ జాతికే దక్కినది. స్త్రీలబలలన్న దోషమును మేడమ్ క్యూరీ పోగొట్టినది. నారీమణులు తలచిన చేయరాని కార్యమేలేదు. స్త్రీలు పురుషులకన్న మిన్నలే కాని, పురుషుల కిందును తీసిపోరని లోకమునకు చాటినది. స్త్రీలకసహజమగు సైన్సు (Science) నభ్యసించి యందు పరిశోధనలు (Researches) సల్పి, రేడియమ్ కనిపెట్టినది స్త్రీయే.

మనము రాజ్యమేలిన రమణీమణుల గురించి చదువుచున్నాము. వినుచున్నాము. యుద్ధమొనరించిన వీరమాతల చరిత్రముల చదివి యానందించుచున్నాము. రాజకీయములందు పాల్గొనిన స్త్రీల నభినందించుచు, వారి కథలు చిత్రవిచిత్రములుగ చెప్పుకొనుచున్నాము. కాని మానవసేవకై తన జీవితమంతయు నర్పించి, లక్షోపలక్షలుగ మహావ్రణబాధచే పీడింపబడువారి చికిత్సార్థమై రేడియమ్‌ను కనిపెట్టి దేవత్వమందిన దేవిని గురించి తెలుసుకొనుట కష్టముగనే యున్నది.

మేడమ్ క్యూరీ పోలండు దేశీయురాలు. ఆమె 1867 వ సంవత్సరము నవంబరు 7 వ తేదిన, వార్సానగరమున వొక సామాన్యునియింట జన్మించినది. తలిదండ్రులకామె కడగొట్టు తనయ.

మేరీ తలిదండ్రులది బీదకుటుంబము. తండ్రి వార్సానగరమున భౌతిక, గణితశాస్త్రముల నేర్పు వుపాధ్యాయుడు. తల్లి వార్సానగరమున యుండు శ్రీమంతుల కుమార్తెలకు విద్యనేర్పుటకు వొక చిన్నబడి నిర్మించి, యందువలన కొద్దిగ ధనమార్జింపసాగినది. కాని మేరీ పుట్టుకతో తల్లికి క్షయవ్యాధి యంకురించుటచే యామె తనబడిని నిర్వహింపలేకపోయెను. కుటుంబమునకంతయు తండ్రి జీతమే యాధారము. ఆ జీతము కూడా తిండికి, బట్టకు సరిపోవుచుండెను కాని కాసైనను మిగులుటలేదు. ఎట్లో భార్యాభర్తలు అయిదుగురు పిల్లలతో వచ్చు రాబడితో సంసారమును జరుపుచుండిరి.

చిన్నప్పటినుండియు మహామేధావిని యగు మేరీ బుద్ధి సర్వతోముఖముగ ప్రకాశింపజొచ్చినది.

బడిలో ప్రవేశించినది మొదలు యామె తరగతిలో ప్రప్రథమురాలుగ యామె యన్ని పరీక్షలలో ఉత్తీర్ణురాలగుచుండెను. మేరీకి పదునైదు వత్సరముల వయస్సు పూర్తికాగానే, బంగారుపతకముతో మేరీ బడిని వదలెను. ఆ నగరమున వుండు బడిచదువంతటితో సమాప్తమాయెను.

మేరీ పదకొండువత్సరముల బాలికగ నుండునపుడు మేరీ తల్లి మరణించెను. పసితనముననే మేరీ మాతృవాత్సల్యమును పోగొట్టుకొన్నను, తండ్రిప్రేమను ద్విగుణీకృతముగ యనుభవించెను. తండ్రికి మేరీపై ప్రేమ మిక్కుటము. తల్లి మరణానంతరము తండ్రియే యామెకు తల్లికూడా యాయెను. తల్లిలేనిలోటు మేరీకెప్పుడును యా తండ్రి కలుగనీయలేదు. మేరీ బడి వదలువరకు తండ్రిని వీడలేదు.

ఇక తండ్రిని వీడిపోవలసిన యవసరము వచ్చినది. ఉన్నతవిద్యకై యామె వార్సానగరము వదలి, పారిస్ నగరమునకు వెళ్లవలసియుండెను. ఉన్నతవిద్య చెప్పించుటకు తండ్రికడ చాలినంత ధనములేదు. ధనాభావముచేతనే మేరీ వైద్యశాస్త్రమభ్యసింపదలచినను వీలులేకపోయెను. ఆ విషయము మేరీకి తెలియును. అక్కచెల్లెండ్రకు, వొకరిపై వొకరికి ప్రేమాభిమానములు మెండు. కనుక యక్క యభిలాషను ఎట్లయినను నెరవేర్పవలయునని చెల్లెలు మేరీ దృఢనిశ్చయము పూనెను.

అక్కచెల్లెండ్లిరువురు చాలాకాలము చర్చించి వొక నిర్ణయమునకు వచ్చిరి. మేరీ యక్క వున్నత విద్యకై పారిస్‌నగరమున వైద్యకళాశాలలో చేరునట్లును, వలయుధనము చెల్లెలు మేరీ పాటుపడి యార్జించి, యక్కకు సాయముచేయుటకును, సోదరి విద్య పూర్తికాగానే, మేరీ చదువుకు యక్క గణించి సాయము చేయునట్లును నిశ్చయించుకొనిరి.

ఈ నిర్ణయము మేరీ యక్కకు నచ్చలేదు. తనకై మేరీ చేయదలచుకొన్న త్యాగమునకామె చకితురాలాయెను. నిశితబుద్ధియగు చెల్లెలే ముందు వున్నతవిద్య నభ్యసింపవలయునని యక్క కోర్కె. కాని మేరీ యా కోర్కెను కొనసాగనీయలేదు. మేరీ పట్టుదలకు యక్క పలుకులు యడ్డమురాలేదు. మేరీ యక్క విధిలేక వైద్యకళాశాలలో చేరెను.

మేరీ వొక శ్రీమంతునియింట పిల్లలకు చదువుచెప్పుటకు కుదురుకొనెను. సాలుకు నాలుగువందల రూబుల్సు (వెండినాణెములు) వేతనమును, వుచితముగ భోజనవసతులును ఏర్పాటుచేసుకొనెను.

మేరీకి జర్మన్, రష్యన్, ఫ్రెంచ్, ఇంగ్లీషు, పోలిష్ భాషలలో పాండిత్యముండుటచే సులభముగ వుద్యోగము దొరికెను. గుణవతియగుటచే యందరిమెప్పులకు పాత్రురాలాయెను. పాటుపడు స్వభావముగల మేరీ వ్యర్థముగ కాలముగడిపెడిదికాదు. తీరికసమయములయందు చుట్టుప్రక్కలనుండు బీదల కుచితముగ చదువను, వ్రాయను నేర్పెడిది.

సోదరివలె మేరీకి వైద్యశాస్త్రమునందభిరుచిలేదు. మేరీ స్త్రీ లబలలని వొప్పుకొనదు. ఆమె యబలయని, సుకుమారియని యామె యెన్నడును యనుకొనలేదు. స్త్రీజాతి కసహజమగు విజ్ఞానశాస్త్రముపై యామెకు మనసుపోయెను. సైన్సు (Science) పురుషులసొత్తు కాదనియు, స్త్రీలుకూడా భౌతిక, రసాయన శాస్త్రము లభ్యసించి, పరిశోధనలు సలుపవచ్చుననియు యామె తలచెను. తాను సైంటిస్ట్ కావలయునని కోరిక యుండెను. కనుక రాత్రులందు, భౌతిక, రసాయన శాస్త్రగ్రంథములన్నియు పఠించుచుండెను.

గడించు ధనమంతయు సోదరికి పంపుటయందే నిమగ్నమై, కాసైనను వుంచుకొనక, వొకొక్క మారు వుత్తరములు వ్రాసి స్టాంపులకై యిబ్బందిపడుచుండెడిది.

గవర్నెస్‌గా పనిచేసి మూడువత్సరములు యక్కకు ధనసహాయముచేయుచు జీవితమును గడిపెను. కొన్నిదినములకు తండ్రి పెన్షన్ పుచ్చుకొనగా తండ్రిచేతిలో కొంతధనము చేరెను. తండ్రి వైద్యశాస్త్ర మభ్యసించుచున్న కుమార్తెకు ధనసహాయమొనరించుచు, మేరీని, మేరీ జీతమును దాచుకొమ్మని చెప్పెను.

నాటినుండియు మేరీ తన చదువుకై ధనము జాగ్రతచేయుచుండెను. చాలినంతధనము చేరగనే తన వుద్యోగమునకు స్వస్తిచెప్పి వున్నతవిద్యకై పారిస్‌నగరమున ప్రవేశించెను.

పారిస్‌నగరమున వుండు సార్బోన్ విశ్వవిద్యాలయము చాలా పురాతనమైనది. అది గొప్ప విజ్ఞాన పీఠము. గొప్పగొప్ప సైంటిస్టులందరు సార్బోన్ విశ్వవిద్యాలయమువారే.

ఆ సార్బోన్ విశ్వవిద్యాలయములోనే మేరీ ప్రవేశించెను. మేరీ యక్క వైద్యపట్టముపడసి, తోటి డాక్టరును వరించి వివాహమాడి, పారిస్‌నగరమందే వాసమేర్పరుచుకొని, చెల్లెలు మేరినికూడా తన యింటనే వుండమని నిర్బంధించినది. మేరీ యక్కకు యెదురాడలేక వారియింటనే వుండెను. మేరి ఇరువది నాలుగుగంటలు కష్టపడి చదువుచుండెడిది. వినోదములచూచుట కామెకు విరామమే వుండెడిదికాదు. మేరీ బావకు మేరీవాలకము నచ్చలేదు. ఈవిధముగ చదివిన మేరీ యారోగ్యము చెడునని బావ భయమంది, నాటకములకు, పాటకచేరీలకు మేరీని బలవంతముగ తీసుకొనిపోవువాడు. బావ తనచదువు కడ్డుతగులుచున్నాడని మేరీ చింతించెడిది. మేరి యాలోచించి, యాలోచించి, తన యక్కయిల్లు త్యజించి ప్రత్యేకముగ వొక గది తీసుకొని యందు నివసించుచుండెను. ఈవిధముగ మేరి బావపోరు తప్పించుకొనినది.

మేరి నాలుగైదు సంవత్సరముల విద్య నేర్వవలసియున్నది. తాను గడించి నిల్వచేసినది, తనతండ్రి పంపునది యీ విద్యకు చాలునా యన్న సంశయము మేరీని తరుచు పీడించుచుండెను. ఆమె యెంతజాగ్రతగ వాడినను నెలకు నలుబది రూబుల్సు ఖర్చగుచుండెను. నలుబది రూబుల్సనగా దాదాపు యిరువదిరూపాయలు. పారిస్‌నగరము మహాపట్టణము. ఆ నగరమున యన్నియు ధరలెక్కువ. నెలకిరువదిరూపాయలు మనదేశములోనే వొక విద్యార్థినికి చాలుట కష్టముగాదా? ఇక పారిస్‌నగరము మాట చెప్పవలసినదేమి? మేరీ దినమున కొక రొట్టెముక్క, వొక కప్ టీ పుచ్చుకొని మరేదియు ముట్టక కాలము గడుపుచుండెడిది. అట్లుచేసియు నెలకు నలుబదిరూబుల్సగుచుండెను.

మేరి కడుపునిండ తిండితినకపోవుటకు ధనాభావము ముఖ్యకారణమైనను, మరియొక కారణము కూడ లేకపోలేదు. భోజనపదార్థములు తయారుచేసుకొనుటకు యామెకు ప్రొద్దులేదు. అమూల్యమగు కాలమును తిండికొరకు వ్యర్థపుచ్చను యామెకు మనస్కరించలేదు. వంటచేసుకొన్న యధమము యరగంటైనను పట్టునుకదా! ఆ యరగంటలో భౌతికశాస్త్రములో కొన్ని పుటలైనను చదువవచ్చునుకదా, లేక లేబరేటరీలో కొంత పరిశోధన చేయవచ్చునుగదా యని యామె వూహ. ఆమె తన భోజనసదుపాయములకై కాలమును యెప్పుడును వ్యర్థపుచ్చలేదు.

మనము బ్రతుకుట భోజనమునకే కదా, ఆ భోజనమును తృణీకరించుట గొప్పా,? భోజనమునకగు కాలము వ్యర్థమనుట పొరబాటని కొందరనవచ్చును. కాని మేరీకి శాస్త్రములతో గడిపిన కాలము సరియైనదనియు, యది విజ్ఞానమును వృద్ధిచేయుననియు, తదితర కార్యములన్నియు వ్యర్థమేనని యామె యభిప్రాయము. అదియుగాక తన వొక్కర్తికై వంటచేసుకొనుట మేరీకంత యిష్టములేదు. రొట్టె, పాలు, టీ, యివియే మేరి నిత్యాహారము. రెండు కోడిగ్రుడ్లున్న భోజనమామెకు పండుగభోజనము. ఒక్కొక్కమారామె తన రిసెర్చిలందు మగ్నయై వారమురోజులవరకు తిండియే తినునదికాదు. భోజన సదుపాయములు లేక మేరీ నీరసించి క్షీణించుచుండెను. ఒక్కొక్కమారు యామె మూర్ఛపోయెడిదికూడా. భోజనమేకాదు, ఆమె నిద్రకూడా యెరుగదు. నిద్రాహారములు మాని యామె యహర్నిశలు పరిశోధనలు సల్పుచుండెను.

ఇట్లు పాటుపడి మేరీ పదునెనిమిది వందల తొంభైమూడవ సంవత్సరము భౌతిక శాస్త్రమునందును (Physics) తొంభైనాలుగవ సంవత్సరమునందు గణిత శాస్త్రమునందును (Mathematics) మాస్టర్ డిగ్రీలను పొందెను. పదునెనిమిది వందల తొంబదినాలుగవ సంవత్సరమే మేరీకి ప్యారిక్యూరీతో పరిచయమాయెను. పరిచయము ప్రేమై పదునెనిమిదివందల తొంబదైదవ సంవత్సరము జూలై యిరువదియాఱవ తేదిన మేరి ప్యారీక్యూరిని పరిణయము చేసుకొనెను.

ఈ ప్యారీక్యూరీ ఫ్రాంస్ దేశీయుడు. అఖండమైన తెలివిగలవాడు. ప్యారీతండ్రి వొక సామాన్య వైద్యుడు. ప్యారీ పదునాఱవయేట బి. ఎస్ సీ. డిగ్రీని, పదునెనిమిదవయేట ఎమ్. ఎస్ సీ. డిగ్రీనిపొంది పారిస్ నగరమున పేరెన్నికగన్న వొక లేబరేటరీలో ముఖ్యుడుగ పనిచేయుచు నెలకు మూడువందల ఫ్రాంక్‌లు గణించుచుండెను.

ఆ సుప్రసిద్ధమైన లెబొరటరీలోనే మేరీకి ప్యారిక్యూరితో పరిచయము గలిగెను. మహామేధావులిరువురు వొకచోగూడిరి. మేరి ధైర్యసాహసములకును, ధీరత్వమునకును ప్యారీ ముగ్ధుడైపోయెను. ఆమె తెలివితేటల కచ్చెరువుచెంది, స్త్రీలు దరిజేరని సైన్సుపై మేరీకిగల యభిలాష కాశ్చర్యపడి, యామెను చేపట్టిన తనకు లేబరేటరీలో, మేరి చేదోడు వాదోడుగా నుండుననియు, ఆమె సాయమున యెన్నియో క్రొత్తవిషయములు కనిపెట్టవచ్చుననియు ప్యారీ తలంచెను. తలచిన తలపును మేరి కెరిగించెను. మేరి కూడా యట్టి తలపే తలచియుండుటచే వారిరువురికి వివాహముజరిగెను.

మేరి, ప్యారీల యన్యోన్యము వర్ణింపరానిది. ఆ నూతనదంపతులు రెండు బైసికిళ్లమీద పారిస్ నగరమంతయు చుట్టుచు యాదినములు సంతోషముగ గడుపుకొనుచుండిరి. అరమరలులేక సంసారము జరిగిపోవుచుండెను.

ఇన్నాళ్లవలె మేరి వొంటరికత్తె కాదు. ఇదివరకు ఆమె వండినను, వండకున్నను, తిన్నను, తినకపోయినను యామెను యడుగువారు లేరు. ఇపుడు సంసారభారము నెత్తిపై వైచుకొన్నది. తన కవసరము లేకున్నను భర్తకై వండకతప్పదు. రిసెర్చిలతోపాటు మేరీ వంటకూడా చేసుకొనుచుండెను. వంటకు మనిషిని వుంచుకొనుటకామె యిష్టపడలేదు. వంట యమితసంతోషముగ చేసుకొనుచుండెడిది.

(సశేషము)

# మీరా

శ్రీ ఇనుమూర్తి బసవరాజుగారు

అమ్మా! గానకళా తపస్వినిరో! మీరాదేవి! గాంగాంక పూ
తమ్మౌ నీచరితమ్ము మ్రోల్లు జివురెత్తన్ హిందుదేశమ్మునన్
సమ్మోదమ్మున జిందినట్టి నవగానశ్రేణి ఈ నాడు హృ
ద్యమ్మై డెందము లాక్రమించినది నూత్నత్వమ్ము బండించుచున్

ఫుల్లేందీవర గంధరమ్యతలవోలెన్ హాయిజేకూర్చుచున్
తల్లీ! కైతల నొక్కసారియును విన్నాణమ్ము దీపింప ను
త్ఫుల్లంబౌ గళమెత్తి గానకళరీతుల్ యుక్కడన్ జింద ని
ర్వేలంబైన యశస్సుగాంచె కవయిత్రీ! గాయనీరత్నమా!

మురహరు పాదకంజముల పూజయొనర్పగలేక రాణివై
వరలుటకింటె భోగముల బాయుటె మేలను త్యాగబుద్ధితో
నరుదగు రాజ్యసంపదల నన్నియు జేగురుగుడ్డవంక జా
తఱగ నొనర్చినావు ప్రమదా! నినుబోలెడు తన్వి గాంతుమే?

ఎట్టి ముహూర్తమందు చిలికించితొ నీ తెలిపాట గానస
మ్రాట్టిని! భూమిమీద నది శ్రావ్యము పేశలమౌచు కాశికా
హట్టములాదిగా భువనమంత ప్రయాణము లాచరించె నా
కట్టగరాని వేగమున కన్నమనీషి నమస్సులీయగా.

జననీ! నేటికిగూడ నిచ్చటను విశ్వమ్మందు నీ గానరా
గిణి-కంజాక్షుని దివ్యశోభలను మా గేహాన పొంగింప మా
నినదే లేదొకరోజుగూడ నెలతా! నిత్యమ్మదేరీతిగా
ఘన గానోపలచిత్తవై మము సుధాకమ్రాబ్ధిలో దేల్పవే!

# కాశ్మీర యాత్ర 



శ్రీమతి వంగల
వాణీబాయిగారు

ప్రేమలత :-ఒదినా, నువ్వు పతీపుత్ర సమేతంగా భూలోక కైలాసం అని పిలువబడే కాశ్మీరం వెళ్లి వస్తివిగదా, మాకు అక్కడివింతలు, విశేషాలు, చూచిన స్థలాలగురించీ చెప్పవూ?

సరళ :-చెప్పకేం! కాని నువ్వు మీ ఆయననూ ప్రోత్సాహపరచి ఇద్దరూ కలసివెళ్లి, అక్కడి సౌందర్యంఅంతా చూచిరావాలి గాని, నేను చెప్పగావింటే అట్టే ఆనందంకలగదు......

ప్రేమ :-అయితే కొంచెం ఆగు వదినా. పాపం, కమలకూడ నువ్వు ఇక్కడకు వచ్చిందిమొదలు నీవు చెప్తే కాశ్మీరాన్నిగురించి వినాలని తహతహలాడుతోంది. ఇప్పుడే పిల్చుకొస్తా.

(ప్రేమలత కమలను తీసుకువచ్చింది. సరళకు దగ్గరగా చాపమీద ఇద్దరూ కూర్చుంటార్లు.)

కమల :-సరళా, కాశీ రామేశ్వరాల గురించి మా అమ్మమ్మ చెప్పేది. యాత్రలు చెయ్యక పోయినా, చేసినవారిని తాకితే పుణ్యంవస్తుందని, ఆ విశేషాలు వింటే పాపాలన్నీ పోతాయని. మా అమ్మమ్మ చెప్పినట్లు పుణ్యం వస్తుందో, రాదో, గాని-వాటిని గురించి వింటూఉంటే ఆశ్చర్యం, ఆనందం, ఉండేది. అప్పటినుంచీ ఎక్కడికీ వెళ్లకపోయినా, వెళ్లినవారు చెప్తూఉంటే చెవి కోసుకుంటాను, అంచేత ఇవాళ నువ్వు కాశ్మీరంలో చూచినవన్నీ చెప్తావుకదూ?

సరళ :-అట్లాగే-కంటికి కట్టినట్లు చెప్పలేకపోయినా, నేను అనుభవించిన ఆనందాన్ని కొద్దిగా నైనా మీకు ఇస్తాలే!-మేము తిన్నగా లాహోరునుండి శ్రీనగరానికి (కాశ్మీరముకు ముఖ్యపట్టణము) మూడువందల పదిమైళ్లకూ, కారు కుదుర్చుకొని జమ్మూదారిగా బయలుదేరేం. అది యింకా చైత్రమాసం అవటంవల్ల జమ్మూవరకూ ఉష్ణంగానే ఉన్నా, ఆపైన అంతటా దట్టమైన మంచువల్ల అమితమైన చలిగా ఉండేది. కారు ఎత్తనశిఖరాలు ఎక్కుతూ ఉన్నప్పుడు క్రిందకు చూస్తే ఎంతో రమ్యంగాఉండేది. ఆ మంచు కొండల మధ్యనుంచి వెళ్లుతూన్నప్పుడు అనుభవించే ఆనందం, హృదయాన్ని పులకరించే దృశ్యాలు, ఏప్రకృతి కవీకూడ పూర్తిగా వర్ణించలేడు. దారిపొడవునా చీనారుచెట్లు వరుసలుగా ఉండి ఇరుప్రక్కలా తోరణాలు కట్టినట్లుండేది. ప్రతి మూడు నాలుగు మైళ్లదూరంలోనూ చిన్న చిన్న పల్లెటూళ్లున్నాయి. ప్రతి గ్రామం లోనూ చిన్న విశ్రాంతిభవనాలు కట్టారు. మేము బటోటు అనే గ్రామం చేరేసరికి చీకటిపడటంవల్ల అక్కడ విశ్రాంతిగృహంలో ఆరాత్రికి ఆగేం. అచ్చట భోజన సదుపాయాలకి లోటు ఏమీలేదు. తెల్లవారి 5 గంటలకే లేచి తిరిగి బయలుదేరేం. దారిలో మంచుచేత కప్పబడియున్న రెండు మూడు గుహాలు వచ్చేయి. ఒకటి బన్హాలు కనుమ (Banhal Pass). అన్నిట్లో ఇదే పెద్దది. అది మంచులో పైనాక్రిందా కూడా దట్టముగా కప్పబడియున్నది.

ప్రేమ :-అమ్మయ్యో! అయితే ఎట్లా వెళ్లగలిగారూ మీరు?

సరళ :-ఏప్రిల్ నెలలో మంచు కరుగుచుండుటవల్ల, ఏ నిమిషంలో ఆపెద్ద మంచుగడ్డలు విరిగి జారి క్రిందబడి బుఱ్ఱలు చితుకుతాయో అని ఈ అపాయం ఎరుగున్నవారు మమ్మల్ని కారునుండి దింపి, గుహ వెనుకఉన్న చిన్న కాలిబాటమీదుగా నడిపించి ఆపైపుకు తీసుకువెళ్లారు, మా కారుమాత్రం కూలీలు

మోసుకొని వచ్చారు. మళ్లీ మేం కారులో శ్రీ నగరుకు 60 మైళ్లముందువున్న 'వెరినాగ్' అనే స్థలానికి వెళ్లేం. అక్కడ కొన్ని చారిత్రాత్మక శిథిలాలూ (Historical ruins), జీలంనదియొక్క జన్మస్థానం చూశాం. ఆనాడు సాయంకాలం శ్రీనగరం చేరుకొన్నాం. శ్రీనగరుకు చేరటానికి షుమారు 20 మైళ్లముందునుండీ దారి పొడుగునా పాప్లర్ చెట్లు ఇరుప్రక్కలా చాల సొగసుగాఉండేవి. ఈ పాప్లరు చెట్టుయొక్క కర్రతోనే మీ అబ్బాయి ఆడే క్రికెటుబేటు చేసారు-తెలుసునా?

శ్రీనగరులో మేం ముందుగానే ఒకబంగళా కుదుర్చుకొని ఉండటంవల్ల తిన్నగా అక్కడికే వెళ్లేం. కొందరు గృహనావలు (House boats) అద్దెకు తీసుకుంటారు. పిల్లలతో అట్లాంటి ఓడలలో ఉండటం అపాయకరమనీ, ఖైదీలమల్లె అందులో పడిఉండటం ఇష్టంలేకా, మంచి విశాలమైన బంగళా తీసుకున్నాం. ఈ పడవలలోకూడ చాల గదులు-వంటగదీ మొదలైనవన్నీ ఉంటాయి. వాటిని ఎక్కడికి కావాలంటే అక్కడికి వాళ్ల ఇష్టానుసారం త్రిప్పించుకోవచ్చు. శ్రీనగరంలో డాలుసరస్సు (Dal lake) అనే పెద్ద చెరువు ఉన్నది. ఆ సరస్సు తామరఆకులతోనూ, పువ్వులతోనూ నిండి ఎంతో మనోహరంగా కనిపిస్తుంది. డాలు సరస్సులో కొన్ని 'చలనశక్తిగల' చిన్న లంకలు (Movable lands) ఉన్నాయి. వాటిమీద కూరగాయలు మొదలైనవి పండించుతారు. అటువంటి కొన్నిలంకలమీద పెద్దచెట్లుకూడ పెరిగిఉన్నాయి. ఒక చిన్నలంకమీద ఒక చక్కనిభవనం కాశ్మీరు మహారాజాగారు కట్టించేరు. అది నీళ్లమీద తేలుతూఉంటుంది. ఒకొక్కప్పుడు ఆ లంకలను ఈడ్చుకుపోయి మరొకచోట పెడుతూఉంటారట. శ్రీనగరంచూస్తే ఇటలీలో వెన్నిసుపట్టణం చూచినవారికి అది జ్ఞాపకానికి వస్తుంది. సౌందర్యంలో శ్రీనగరం వెన్నిసు నగరానికి తీసికట్టు. వెన్నిసుపట్టణంలో ఎక్కడకు పోవాలన్నా ఆ మురికి కాలువలమీదనే 'గండోలా' అనే చిన్నపడవలలో వెళ్లాలి. శ్రీనగరులో మోటారుకార్లమీదకూడ ఎక్కడికి కావాలన్నా పోవచ్చు. 'షికారా'లు అను చిన్న కాశ్మీరు పడవల్లో జీలమునది మీదకాని, డాలు సరస్సులోగాని వెళ్లుతూఉంటే చాల హాయిగా ఉంటుంది. ఒక షికారాలో నలుగురు కూర్చోవచ్చు. చాలామంది స్నేహితులుకలసి ఏ చక్కని ఉద్యానవనానికోపోయి దినమంతా అక్కడ గడపి, ఫలహారాలు మొదలైనవి ఆరగించి రావాలంటే, డాలు సరస్సులోగాని, జీలమునదిమీదగాని 'దూంగా' అను పడవలలోవెళ్లి వస్తారు. దూంగాలో 2, 3 గదులు, వంటకు వేరేగది, ఉండి చాలమంది వెళ్లుటకు విశాలంగానూ, సదుపాయంగానూ ఉంటుంది. కొందరు వంటలుకూడా అందులోనే చేసుకుంటారు.

ప్రేమ:-నువ్వుకూడ అట్లా ఎప్పుడైనా వెళ్లావా?

సరళ:-ఆ-వెళ్లకేం! అక్కడ చూడవలసినవన్నీ చూసేను. ఇంకా మేము ప్రతి ఆదివారం ఒకొక్క నూతనస్థలం చూట్టానికి వెళ్తూఉండేవారం.—నిషాత్ బాగ్ 300 సంవత్సరముల క్రితం జహంగీరు యొక్క మామగారిచేత కట్టించబడిందిట. ఈ తోట అంతస్థులంతస్థులుగా కట్టబడింది. ప్రతి అంతస్థూ చక్కని పూలమొక్కలతోనూ, ఫౌంటెన్లతోనూ అమర్చబడిఉన్నాయి. ఇట్లాంటివి ఏడు అంతస్థులున్నాయి. మైసూరుకి 10 మైళ్ళ దూరంలో ఉన్న 'బృందావన్' చూసినవారికి దీనియొక్క అందము తెలుస్తుంది. ఈ తోట 7 వ అంతస్థునుండి చూసిన, డాలు సరస్సు, హరిపర్బత్, మహదేవపర్వత శిఖరము మొదలైనవి కనిపిస్తూఉంటాయి.

షాలిమారుతోట శ్రీనగరుకి 9 మైళ్ళ దూరములో 1700 శతాబ్దంలో జహంగీరు నిర్మించేడు. ఈ తోటలో మధ్యమధ్య చిన్న సౌధాలుకూడ ఉన్నాయి. వేసవి సాయంకాలాలు నవాబు తన స్త్రీలతో, అక్కడ ఆటపాటలతో ప్రొద్దుపుచ్చేవాడని చెప్తూఉంటారు. ఆ తోటకి మధ్య ఒక నీటిప్రవాహమున్నూ, వందలకొలది రకరకాల ఫౌంటెన్లు ఉండి ఇరుప్రక్కలా పచ్చని గడ్డితోనూ పూలమొక్కలతోనూ తివాసులు పరచినట్లు ఉంటుంది. అక్కడ ఉన్నంతసేపూ, వైకుంఠమదియే అనిపిస్తూఉంటుంది. అక్కడ కట్టబడ్డ జనానామహలులో పైకప్పు చక్కని నల్లరాతిపై చిత్రాలతో అమర్చిఉన్నది. నిషాత్ బాగ్ కన్న షాలిమార్ బాగ్ చాల నిశ్చలంగానూ, శాంతంగానూ ఉండి, ఎంతదుఃఖములో నున్నవారికైనా ఈ బాహ్యప్రపంచాన్ని మరిపింపజేస్తుంది.

శ్రీనగరానికి 4, 5 మైళ్ళ దూరంలో 'నసీమ్‌బాగ్' అనే మరొకతోట ఉన్నది. ఆ తోటకి 2 ప్రక్కలా మంచి పొడవైన చీనారు చెట్లు ఉండి (ఇవి 120 చెట్లు గలవు) దూరమునుండి చూసేవారికి ఒక రాక్షససేన ఎదుర్కొటానికి వస్తున్నదా! అనిపిస్తుంది. ఈతోటగాలి చాల ఆరోగ్యకరమైనదని చెప్తారు. అక్కడనుండి డాలుసరస్సు, అందుగల చిన్నచిన్న లంకలు, ఒకప్రక్కన శంకరాచార్యులవారి కొండ మొదలైనవి చక్కగా కనబడతాయి.

చష్మాసహాయి మంచినీరుకు ప్రసిద్ధికెక్కినది. అచ్చట కట్టబడియున్న నల్లరాతి కట్టడాలనుండి జలము ప్రవహిస్తూఉంటుంది. ఆ నీరు ఆరోగ్యానికి చాల శ్రేష్ఠమైనదని అంటారు. కాశ్మీరు మహారాజా ప్రతిదినం ఆ నీరే తెప్పించుకొని త్రాగుతాడట. చూడటానికి వెళ్లినవాళ్లుకూడ కొంచెం సేవించుతారు, కాశీ గంగకు మల్లె! అచ్చట చక్కని చిన్న పూలతోటకూడ ఉంది.

కమల:- సరళా, ఆనీరుకూడా గంగాజలం తెచ్చినట్లు పాత్రల్లోపట్టి తేవచ్చునా?

సరళ:- చీ ఊరుకో, పిచ్చిప్రశ్న లెయ్యక నన్నుత్వరగా చెప్పనీ. అక్కడకు దగ్గరలోనే ప్యారీ మహల్ అనే ఒకపురాతన భవనం శిధిలం అయి కొన్ని పెద్దగోడలు, ఆర్చీలు, మాత్రం కనిపించుతూ ఉంటాయి. ఇదికూడ 17 వందల శతాబ్దంలోనే కొందరు సుఫితురకలవల్ల, ఖగోళ శాస్త్రనిమిత్తం (astronomical purposes) కట్టబడింది. ఈపాడుబడిన భవనములో నిశా సమయాలందు దెయ్యాలు విహారంచేస్తూ ఉంటాయి అన్ననమ్మకంచేత అక్కడికి ఆసమయాల్లో ఎవర్లూ వెళ్లరు.

శ్రీనగరంలోనే ఒకవెయ్యి అడుగులు ఎత్తుగల పర్వత మొకటున్నది. ఆకొండ శిఖరం మీద ఒక శివుని ఆలయం కట్టారు అది క్రీ॥ పూ॥ 200 సంవత్సరంలో జలకా అనే ఆయనచేత కట్టించబడిందని వాడుక. శంకరాచార్యులవారు దేశమంతా తిరిగి అంత్యకాలంలో ఈకొండపైనే నిశ్చింతతో ఆఖరిదినాలు గడిపేరట. అప్పటినుండి ఆ కొండను 'శంకరాచార్య పర్వతం' అంటారు. శ్రీనగరుకి వెళ్లినవారు ఈకొండపైకి తప్పక వెళ్తారు. ఆపైగుడికి మాత్రం హిందువుల్నే తప్ప మరి యే ఇతరజాతులవారినీ వెళ్లనీయరు. ఈ పర్వతశిఖరం నుండి చూస్తే దాని చుట్టుప్రక్కల 15 మైళ్ళదూరం వరకూ చిన్న చిన్నకొండలూ, చెరువులు, లోయలూ, చీనారుచెట్లవరుసలూ, డాలుసరస్సు, శ్రీనరుపట్టణము-ప్రకృతి అంతా మన కన్నులముందు పెట్టినట్లు కనిపించుతుంది. కొన్నిసంవత్సరాల క్రిందట మైసూరు మహారాజావారు ఈకొండపైకి వెళ్లిచూచి ఆనందించి,

ఈపర్వతం పగలు మాత్రమే గాక చీకటిసమయంలో కూడా ప్రజలకు కనబడాలని, 5 వేల కాండిల్ పవర్ (candle power)గల ప్రతాపీహీరా అనే ఒకపెద్దకాంతిగల ఎలక్ట్రిక్ లైటు పెట్టించారు. ఆ విద్యుద్దీపాన్ని చీకటిరాత్రులలో చూస్తే నక్షత్రంలాగ గోచరించుతూ ఉంటుంది.

శ్రీనగరుకిపైన 450 అడుగుల ఎత్తుగల మరొక చిన్నకొండ ఉన్నది. ఈ కొండపైననే ఖిల్లా (fort) ఉంది. దీనిని హరిపర్వత్ ఖిల్లా అంటారు. ఈ కొండపైన కొన్ని పురాతన హిందూదేవతల విగ్రహాలు, ఒక కాళికాదేవిగుడి, ఒక జలశూన్యమైన కోనేరు మొదలైనవి ఉన్నాయి. కోటలోపల పూర్వపు యుద్ధపరికరములు ఉండేకొట్లు, మరికొన్ని ఖాళీగదులూ కనుపించుతాయి. ఈ కోటపైనుండి ప్రతిదినమూ ఉదయం, మధ్యాహ్నం, రాత్రి, మూడుపర్యాయములు ఫిరంగీ పేలుస్తారు. దీనిపైకి శ్రీరామనవమినాడు, దుర్గపూజారోజున మాత్రమే అందర్ని వెళ్లనిస్తారు. ఇతర రోజులలో వెళ్ళటానికి ప్రత్యేకఅనుమతి కావాలి.

ఇవికాక కొన్ని తురకల గోరీలు, జుమ్మా మసీదు, సెంట్రల్ జైలు, కొన్ని సిల్కు ఫాక్టరీలు, కాలేజీలు, హాస్పిటల్సు, రఘునాథ దేవాలయం, రాజభవనాలు, శ్రీ నగరులో ముఖ్యముగా చూడవలసినవే.

శ్రీనగరులో ఉన్నంతకాలం ఎంతడబ్బున్నా అక్కడ ఉన్న వింతవస్తువులు కొనటానికే సరిపోతుంది. చక్కని వెండిసామాన్లు, మంచి మెత్తని పశ్మీనా శాలువలు, చాల పనివాడితనముగల ఎంబ్రాయిడరీ బట్టలు, చక్కని సిల్కులు, సొగసుగా చేయబడిన కొయ్యసామానులు, పేము(Cane) సామానులూ, కాగితంతో తయారుచేసి పైరంగులతో చిత్రించిన భరిణలూ, ఉన్నికోట్లు, (Ladies' fur-coats)ఒకటేమిటి, చూచినదెల్లా కొనాలని బుద్ధిపుడుతూ ఉంటుంది! ధరలుకూడా చౌకగానే ఉంటాయి.

ప్రేమ:-ఒదినా, నువ్వు మాకుతెచ్చిన చీరలు ఏమాత్రం ఖరీదు ఉంటాయి?

సరళ:-ఒక్కొక్కటీ 10 రూపాయల లోపు ఉండును.

కమల:-అంతతక్కువ ధరలో ఇంతఅందమైన సిల్కుచీరలు దొరకటం ఆశ్చర్యమే!

సరళ:-అక్కడ శ్రేష్టమైన కుంకుమపువ్వుకూడా దొరుకుతుంది. శ్రీనగరు చుట్టు ప్రక్కల ఊళ్లలో ఈ చెట్లు చాలఉన్నాయి. ఇంక కాశ్మీరస్త్రీల అందాన్నిగురించి చెప్పనేలేను. వాళ్లు ఎంతో బాగుంటారు. ఇదుగో! ఈ ఫోటో చూచి మీరే ఆ స్త్రీలఅందాన్ని ఊహించుకోండి! ఇంకా నే చెప్పవలసింది చాల వుంది. ఇవ్వాళ్లకి ఇంతేచాలు. చాల పొద్దుపోయినది. రేపు మీకు కాశ్మీరులోనే ఉన్నయితర జాగాలను గురించి వినిపిస్తాను. అవి ఇంతకంటే బాగుంటాయి.

(సశేషము)








కోమలమైన ముఖ కాంతిని స్త్రీలు సామాన్యముగా పొందగలరు. దీనిని నిరాకరించిన మీ సౌందర్యమునే కొంతమట్టుకు చెడగొట్టుకొనెదరు.

స్త్రీ యొక్క సౌందర్యమును అభివృద్ధిచేయుటకై అనేక సదుపాయములు ఉండినను, ఆమె శరీరము మోటుగా యుండిన యీ ఉపాయములు ఏవియు పనికిరావు. శుభ్రముగాను, మృదువుగాను నుండు శరీరము స్త్రీ సౌందర్యమునకు అతి ప్రాముఖ్యము.

చర్మరంధ్రములందు మురికి అధికముగా చేరుటవల్లను, మిక్కిలి ఎండ, వేడిగాలివల్ల చర్మము పగిలి మోటుగా నుండుటవల్లను ముఖము కాంతివిహీనమగును. ప్రతిదినము తప్పక పాండ్స్ క్రీములు రెండిటిని వాడిన మీ ముఖము గులాబి రేకువలె కోమలముగా నుండును. వీటిలోనుండు తైలములు చర్మరంధ్రములలో బాగుగా జొరబడి అందుండు మురికిని పోగొట్టి శుభ్రపఱచును.




ప్రతిరాత్రి, ఉదయము ముఖమునకు మరియు మెడకు పాండ్స్ కోల్డ్ క్రీమును కొనవ్రేళ్లతో మెల్లగా రాయుడు. రోమరంధ్రములందుండు క్రొవ్వును, మురికిని కరగించుటకు కొన్ని నిమిషములు అట్లనేయుంచి పిదప తుడిచివేయుడు. పగలు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును ఉపయోగించుడు. ఇది చర్మముమీద కంటికి తెలియని, జిడ్డులేని పొరనొకటిని ఏర్పఱచి ఎండ, గాలి, దుమ్ము వీటినుండి ముఖమును రక్షించును.

ఈ దినమే పాండ్స్ క్రీములను ఉపయోగించుటకు మొదలిడుడు. కొన్ని వారములలోనె మీ ముఖము యౌవనభరితమై కోమలముగా నుండును.

# • పాండ్స్ క్రీమ్ •

# "పిచ్చిది!"

శ్రీమతి బులుసు ప్రకాశమ్మగారు

> 'సంఘద్వేషానికీ, లోకాచారానికీ, బలి ఐపోయి, కాలపరిస్థితుల వల్ల జీవచ్ఛవాలుగానూ, మృత జీవులుగానూ చేయబడ్డ ఈ లాంటి పిచ్చివాళ్లు భారతదేశంనిండా ఎందరున్నారో కదా!'

'పిచ్చిది! పిచ్చిది! అరేయి; పిచ్చిదిరా! రాండిరా!'

మధ్యాన్నం మూడుగంట లవుతుంది. కాఫీ 'అయిటం' పూర్తిచేస్తున్నాము. కమల చిన్నకొడుకు శేషు, పంట్లాం జేబులలోను, చొక్కాజేబులో కొన్ని, ఇంకా గుప్పెళ్లలో పట్టుకోగలిగినన్ని వేరుశెనక్కాయలు తీసుగుని తల్లివేపు దొంగచూపులు చూస్తూ జారుతున్నాడు. మళ్లీ పోసుగుపోతున్నావు కాదూ? అన్నట్టు తనవేపుచూశిన తల్లిచూపుకు జవాబుగా 'పిచ్చమ్మకే' అని దీనంగా ప్రాధేయతగా తల్లిని లాక్కోవద్దన్నట్టుగా అని వీధులోకి ఉడాయించాడు. కమల నవ్వి ఊరుకుంది. అన్ని వేరుశెనక్కాయలు పిల్లవాడు పోసుగుపోతూంటే ఊరుకుంటుందేమిటి! కమల! జబ్బుచేయవూ?! నాకేమీ అర్థంకావడంలేదు. వీధులో ఇంకా గోలగానే ఉంది. 'పిచ్చిది! పిచ్చిది!'

'అబ్బా, ఎంత గోలగావుంది వీధి! ఎవరాపిచ్చిది?' అన్నాను కాఫీ తాగుతూనే. 'చూద్దుగాని రా' అంది కమల.

ఇంగ్లీషు యూనిఫారములో పెద్ద బ్యాండుమేళం ఒకటి, దేశీయ యూనిఫారంలో (చిరతపులి మచ్చల డ్రస్సులతో) పది డప్పులు, కొబ్బరాకులు, రంగు కాగితాలు, అరటాకులతో అలంకరించిన బళ్లు రెండు, బ్రహ్మాండంగా వెడుతోంది, సినీమా ఎడ్వర్టైజుమెంటు. జనం గుమ్మాలలోంచి, అరుగులమీదనుంచి ఎంతో ఉత్సాహంగా చూస్తున్నారు. స్త్రీలు సగం అల్లిన జడ ఓచేతిలో ఉండగానే రెండోచేత్తో పిల్లల చేతిలో పేపరు అందుకుని చదివేస్తున్నారు అడావిడిగా. ప్లీడరుగారొకరు బుజాన్ని వేల్లాడే సగంవిప్పిన కోటు, తలపాగాతో అరుగుమీద నుంచుని, నౌఖరుచేతులో పేపరు అందుకోడంలో పాగా జారి సైడు కాలవలో పడిపోయింది. పెద్ద పిల్లలగుంపు వకటి బండ్లవెనకాల విడవకుండా ఊరేగుతోంది. ఒక్కొక్కడి చేతులో రెండు మూడు, ఇంకా ఎక్కువే ఉన్నాయి పేపర్లు. అయినప్పటికీ వారు బండిని విడవడంలేదు. నాకో పేపరివ్వరూ? నాకండి, నాకండి, అంటూనే ఉన్నారు.

పిల్లల గుంపుతోకూడా ఊరేగుతోంది ఒక పిచ్చిది. పుచ్చుగునే పేపర్లు పుచ్చుగుంటూనే ఉంది. పంచిపెట్టేవి పంచిపెడుతోంది. కొందరిని ఎత్తుగుంటోంది. మళ్లీ ఏం పుడుతుందో నిమిషానికే దింపేస్తుంది. మళ్లీ ఇంకొహణ్ణి ఎత్తుకుంటుంది. అందరితోనూ మాట్లాడుతోంది. పరిగెడుతోంది. నవ్వుతోంది. పిల్లలుకూడా మామూలు పిచ్చివాళ్లని చూశినట్టు ఈవిడని చూడడంలేదు. పేపర్లు ఇచ్చేవాడొకడు. తను దాచితెచ్చినవి 'తిను' అని పెట్టేవాడొకడు. కొంగుపట్టుగు నడిచేవాడొకడు. చంకకెగిరేవాడొకడుగా ఉన్నారు.

'అయ్యో ఇదేమిటి!! కూరెళ్ళారి చిట్టెమ్మగ్రా! చిట్టెమ్మ చచ్చిపోలేదు! బతికేఉంది' అంటూనే చిట్టెమ్మా? ఓ చిట్టెమ్మా? అని కేకవేశాను నేను.

'ఇదేమిటేవు! లక్ష్మీ? పిచ్చిదాన్ని చూడగానే నీక్కూడా పిచ్చెక్కిందా? ఏమిటి? ఏమిటా కేకలు, వీధులో? రా, లోపలికి' అంది కమల.

చిట్టెమ్మ తిరిగేనా చూడలేదు. పిల్లవాణ్ణొకణ్ణి చంకనెత్తుకుని ముఖంమీద ముఖంపెట్టి కళ్లల్లో చూస్తూ ఏదో మాట్లాడుతోంది. ఎల్లాంటిమనిషి ఎల్లాగైపోయింది! బతికేఉంది! మహా చూశి ఏడిశినవాళ్ళల్లే ఏట్లోపడి చచ్చిపోయిందన్నారు! అంతే, శ్రద్ధగా వెతికిన దిక్కేరీ? బారెడు జుట్టు! దుమ్ముతో నిండి ఎల్లాగైపోయిందో!! బట్టరంగు, జుట్టురంగు, వంటిరంగు ఒక్కలాగుంది. ఏరోజు కేగతో గదా! అయినా అన్నికష్టాలు పడ్డాక ఇంతకంటె - అంటున్నాను నేను. నువ్వెక్కడేనా చూశావా ఏమిటి, ఈ మనిషిని? అంతగా బాధపడుతున్నావు? అంది కమల.

'ఎరగడమేమిటి? అయిదారేళ్ల నాటి సంగతి ఇది. నేను ఆ రోజులలో పదమూడు పధ్నాలుగు ఏళ్ల దానిని. చిట్టెమ్మ ఈవిడపేరు. వీళ్లు మాయింటికి మూడిళ్లవతల కాపురం ఉండేవారు. ఈవిడ భర్త ఏదో ఎలిమెంటరీ స్కూలులో మాష్టరు. ఇంకా ట్రైనింగ్ కాలేదని చెప్పుగునేవారు. రెండేళ్ల పిల్లవాడుకూడా ఒకడు ఉండేవాడు ఈవిడకి. వీళ్లుండే వాటాకి నెలకు మూడురూపాయలద్దె. సామాన్యంగా మూడురూపాయల వాటాలు ఎల్లా ఉంటాయో అల్లాగే ఉండేది, వీరి వాటా. మట్టి, చీకటి, ఇరుకు, నేలబారు అవడంచేత తేమ. కాలం ఏదోవిధంగా నెట్టుకుపోతూఉండేది, వీరికి. ఆ పక్కవీధులో వాళ్ల పెళ్లి వీళ్ల పాలింటికి ముప్పైంది. వచ్చిన పెళ్లివారిలో ఈవిడ పుట్టింటివారిని ఎరుగున్నామె ఒకర్తె ఉంది. చిట్టెమ్మని చూడగానే ఆవిడకు నాలిక దురదపెట్టింది. ఒకళ్లిద్దరితో కొన్ని రహస్యాలు రహస్యంగా మాట్లాడేవరకూ ఆ దురద పోలేదు ఆవిడకి. ఆవిడ రాక చిట్టెమ్మ జాతకంలో శని ప్రవేశం అయింది. అమ్మలక్కలకి ఎండవేళ కాలక్షేపానికి బోలెడంత సామగ్రి దొరికింది. 'చిట్టెమ్మ విధవపెళ్లి ఆడిన ఆవిడకూతురు! వీళ్ల పెద్దక్కయ్య మొగుడిది అదేదో మతం. బ్రహ్మసమాజంలాంటిది. వీళ్ల చెల్లెలికి పధ్దెనిమిదేళ్లు వచ్చాయి! ఎవడూ పెళ్లాడ్డం లేదు! గతిలేనట్టు మాలదొరసాన్ల ఇస్కూల్లో చదువుతోంది!' నాలుగు ఆడమొహాలు సమావేశపడిన చోటునల్లా ఈ విచిత్ర ఇతిహాసంమీద యాక్షన్లతోకూడా చర్చ జరుగుతూఉండేది. 'హాశి దీనమ్మ కడుపు కాల! విధవముండ కూతుర్నన్న ఎబ్బెరికమన్నా లేకుండా ఏమొహంపెట్టుకుని సంసారిళ్ల మధ్య కాపరానికి సిద్ధపడిందో?' 'ఎప్పుడూ పుస్తకం వోటి పట్టుక్కూచుంటుంది. ఏవిటి చెప్మా! అనుకున్నాను, సంగతిదీ, ఆ మతాలవాళ్ళందరూ అంతేనుట! మగాళ్లు, ఆడాళ్లు ఎప్పుడూ పుస్తకాలలోనే మునిగి తేలతారుట. మనందరితోనూ ఓనాడేనా కూచుని మాట్లాడిన పాపాన్ని పోయిందా? పోనీ అని నేనే ముందు పలకరించాను మొన్న. నంగి నంగిగా మూడుమాటలాడి ఇంట్లోకి చక్కాపోయింది. ఎందుకా! అనుకున్నాను. ఈ కళ్ళంతా బయటపడుతుందని కామోసూ.' 'ఆ చెల్లెలుకి పెళ్లెందుకూ? ఆనక పంతులమ్మై ఏ కుశనీవాణ్ణో కట్టుగుంటుంది' ఇవీ మాటలు.

ఆ పొరుగుపెళ్ళి ఒక్క చిట్టెమ్మ ప్రాణానికేకాదు, నా ప్రాణానికికూడా వచ్చిందంటే నమ్మ.

చిట్టెమ్మదగ్గర రోజూ నేను మధ్యాహ్నం, ఏవో కుట్లూ, అవీ నేర్చుకునేదాన్ని. ఇప్పుడు నాకు వచ్చిన ఇంగ్లీషు కాస్తా ఆవిడ చెప్పినదే. ఈ దెబ్బతో నా చదువు 'బం'ద్దైంది. 'పెళ్లీడొచ్చిన పిల్ల ఆ బ్రహ్మసమాజందానితో సావాసం చేస్తోందంటే ఎవడూ మీ గడప తొక్కడు. పిల్లకి పెళ్ళికావడంకూడా కష్టం, ఆనక మీ ఇష్టం, మీకోసమే చెబుతున్నాం, మాకెందుకు?' అన్నారు, అమ్మలక్కలు అమ్మతో.

'వెర్రివాడి పెళ్లాం వాడవారందరికీ వదినేట!' నిన్నటిదాకా ఈ చిట్టెమ్మ తిందో పడుకుందో తెలియనివారందరికీ ఇప్పుడు ఆవిడని కనిపెట్టడం ముందుపన్నై కూచుంది. 'ఓ చీరోటి ఆరేశి కట్టుకుంటే సరి. ఎన్ని పెంటలు తొక్కినా అది మడేను. పట్టుపంచ కొనుక్కోలేకపోతే పోయిరి, నారపంచేనా కొనుక్కునేడవదేం?' అంటుంది, ఓ 'త్రిపాఠి'. 'మొగుడింటికొచ్చాడనగానే తుర్రున లోపలికి పరుగెత్తి తలుపేసుకుంటుంది. ఓ యబ్బా! ఇంకా గడించే మొగుడైతే కిందూ మీదూ కానకే పోనేమో!' అంటుంది, ఓ పుట్టు సన్యాసి. నేను మొన్న చూశానమ్మా! పోపులోనే 'ఇంతంటె ఇంత' మినప్పప్పు వేస్తు. బాగా సంసారం పొదుపుచేసి 'కంటె' చేయించుకుందాం అనుకుంటోంది కాబోలు!' అంటుంది, ఓ నడమంతరపు సిరిమంతురాలు. 'సోమవారం ఉపోషం కూడాను దీని బతుక్కి! సిగ్గు చిమడ!' అనే ఆచారమంతురాలు ఒకామె. ఇలా ఎన్నని చెప్పను?

చిట్టెమ్మ కష్టాలు ఇంతతో తీరలేదు. రోజు తక్కువైనప్పుడు 'తాడే తాచుపామై' కరుస్తుందిట. చిట్టెమ్మ కాపురం ఉన్న ఇంటివారికి ఒక కొడుకున్నాడు. పదిహేనేళ్లుంటాయి ఆ పిల్లవాడికి. పిఫ్తుఫారం చదువుతూ ఉండేవాడు. బాగా తేపగా పెరిగి కొంచెం అందంగా ఉండేవాడు. ఈవిడ ఆ పిల్లవాణ్ణి అపేక్షగా చూడడం, మాట్లాడ్డం, ఏదేనా తినమని పెట్టడం, ఇల్లా ఉండేది. పిల్లవాడు పెరట్లో మసిలేటప్పుడు, మంచిబట్టలేసుగుని స్కూలుకెడుతూంటేనూ, ఎక్కడో ధ్యాన్నిస్తూ చూసేది అతడివేపు. ఆ అబ్బాయికూడా ఈవిడని 'చిట్టెమ్మగారూ?' అని నోటినిండా పిలిచి గౌరవంగా మాట్లాడేవాడు. లోకాచారం అనే భూతద్దంతో మర్యాదలని జాగ్రత్తగా పరిశీలిస్తూ కుటుంబాలు కూలిపోకుండా రక్షించడపు భారం మీద వేసుగున్న అమ్మలక్కలు దీన్ని ఎంతమాత్రం సహించలేకపోయారు. ఇదంతా ఏదో పెనుముప్పుకి మూలంలా కనిపించింది వారికి. 'వేషాలనీ, తల్లిపోలికనీ, మంచిమాట్లాడి చెల్లెలిని అంటకట్టాలని చూస్తోందనీ, మతాలవాళ్ళకి ఓ మొగుడే ఉండాలన్నమాట లేదుట, ప్రేమలుట! అవేవో, వీళ్ళ విధం'అనీ అసహ్యమైనమాటలు చెప్పుగునేవారు. ఒకప్పుడు చిట్టెమ్మ నాతో, 'అమ్మ చచ్చిపోతే నాలుగునెలల తమ్ముణ్ణి ప్రాణంలా పెంచాను. చంద్రుడులా ఉండేవాడు. బతికుంటే పదిహేనేళ్లు ఇప్పుడు' అని కళ్ళనీళ్లు పెట్టుకోడం, ఇప్పుడు జ్ఞాపకంవస్తోంది నాకు. అప్పుడు నేను చిన్నదానిని.

తగిలిన వేలుకే తగులుతుందిట. చిట్టెమ్మ పెనిమిటి మాస్టరీ చేసే స్కూలు ఎలిమెంటరీ స్కూలని చెప్పానుకాదూ? ఆ స్కూల్లో చదువుకునేవాళ్లలో, పందులాళ్ల పిల్లలూ, పాములాళ్ల పిల్లలూ, పాకీవాళ్ల పిల్లలూ హెచ్చుట! ఆపకంపెనీలో చిట్టెమ్మమీద అలజడి ప్రారంభమైనాక సి. ఐ. డి. ముసలమ్మలు ఈ సంగతి రాబట్టడానికి ఆట్టే రోజులు పట్టలేదు.

మా వీధులో ముసలమ్మ ఒకావిడ వుండేది. ఇలాంటి 'కూపీ'లు తీయడంలో ఆవిడ మెడలిస్టు. షష్టి ఘడియలూ ఎవరో ఒకరితో 'మాట, ఇదిగో విన్నావూ? కూచో, మరే, ఆ సూరాభట్లారు-ఇల్లు కొనుక్కున్నారే-నాలుగొందలు అప్పు తెచ్చారట!-కంటెమ్మే కారుట కూడ! మనకెందుకులే? మళ్లీ ఎక్కడా అనకేం, తిడతారు! మనకెందుకు? ఆ మనిషికేం, అవి కట్టుపళ్లుసుమా! నేనన్నానని అనకు. ఆ పిల్ల చెయ్యెల్లా విసురుకుంటుందెందుకు? నడుస్తూ? సూరమ్మ మొహాన్ని కళేలేదు. ఎక్కడ రాకాడోగాని దేముడు!' అంటూ, కబుర్లు విడేయకపోతే అన్నం అరిగేదికాదు ఆవిడకి. చిట్టెమ్మ పెనిమిటి సూక్ష్ములు సంగతి, అంగలేసుగుంటూ వచ్చి కూచుంది, ముసలమ్మదగ్గర.

ఈలాంటి మాటలువింటూ ఇంటావిడ ఎన్నాళ్లు ఊరుకోగలదు? ఆవిడా ఆడదే. 'రేపు పిల్లాడికి సంబంధంవస్తే? ఈ మాటలు వాళ్లచెవినిపడితే, వాళ్లు పిల్లనిస్తారా?! దిక్కుమాలిన అద్దె పోతేపోయింది. ఆ మాలగుడ్డలు ఇంటినిండా కలుపుతోంది కాబోలు. కుర్రవెధవ, దానితో మాట్లాడొద్దంటే వినడు. రేపు వియ్యాలారు పిల్లనికూడా పంపరేమో, పండక్కి' అనుకుంది. ఇల్లు ఖాళీచేయమంది.

ఎంత వెతికినా ఆ దంపతులకు ఇల్లు దొరకలేదు. 'వెధవముండ కూతురు! ఎల్లా ఇవ్వం?' అన్న మీమాంస గొంతుకు బట్టుకుంది. ఆఖరుకి దూరంగా ఏదో పేటలోకి వెళ్లిపోయారు వాళ్లు. నేనత్తారింటికి వెళ్లిపోయాను.

నాలుగేళ్ల తరవాత విన్నదిది:-

చిట్టెమ్మా మొగుడూ ఊరందరికీ బాకీలు పడ్డారు. ఇంటివాళ్లకు బోలెడద్దె బాకీ. ఎక్కడా అప్పు పుట్టడంలేదు. తిండికిలేక అభోజనాలు పడుకుంటున్నారు. పనికూడా పోయింది.

మరి రెండేళ్ల తరువాత...మావూరు వెళ్లినప్పుడు విన్నది:—

'చిట్టెమ్మ మొగుడు పక్షవాతంవచ్చి పోయాడు. పుట్టింటివాళ్లు 'అజ' లేరు. పిల్లవాడు అల్లరి వెధవై ఊరంబడి తిరుగుతూ ఉండేవాడు. సినీమాబండ్లవెనకాలే వాడిఉనికి. ప్రతీ బండివెనకా వాడేను. బండీవెనక పోతూంటే ఎంతదూరం పోయినదీ వాడికి తెలియదు. అల్లా పోయి పోయి ఒకనాడు ఎటు పోయాడో మళ్లీ కనిపించలేదు. దుఃఖం భరించలేక చిట్టెమ్మ ఏట్లోపడి చచ్చిపోయింది'. పైన మాట రాలేదు నాకు.

కమల కళ్లు తుడుచుకుంటూ 'సంఘద్వేషానికీ, లోకాచారానికీ, బలి ఐపోయి, కాలపరిస్థితులవల్ల జీవచ్ఛవాలుగానూ, మృత జీవులుగానూ, చేయబడ్డ ఈలాంటి పిచ్చివాళ్లు భారతదేశంనిండా ఎందరున్నారో కదా!' అనిమాత్రం అనగలిగింది. అవును. ఎందరున్నారో?!

# కన్నతల్లి మనస్సు

శ్రీ సాదలి రామస్వామి, బి. ఏ., బి. యల్.

సీ॥ వెన్నకన్నను బహు విమలమై, మృదులమై
యానంద సుధఁ జిల్కు నమ్మమనసు!
వాత్సల్యరుచిరప్రభావంతమై సద్ద
యారసముం జిల్కు నమ్మమనసు!
సద్గుణ సత్కృపాసంపన్నమై, నిత్య
సౌఖ్యప్రదాయియా జననిమనసు!
నవనీత సారమై, నవ్యలావణ్యమై
చనువుఁ దొలకరించు జననిమనసు!

గీ॥ నెఱుఁగఁదరమౌనె యిట్టిదంచేరికైన?
ననుభవింపక దాని, వ్రాయంగ నగునె?
తల్లి ఋణముఁ దీర్పఁగలఁడె తనయుఁ డెన్ని
జన్మములకైన, సర్వమ్ము జననికాదె?!

గీ॥ ఎన్నికష్టాలకో యోర్చి, యెంతో మమత
నెదను జోకొట్టి, చంకనెత్తి పెంచి,
కడకు సుతుని చేతులమీదఁ గడలిపోవఁ
దలచు తల్లిమానస మెంత త్యాగయుతమొ?!

గీ॥ శిశువు మలమూత్రములఁ బ్రేమచేత నెత్తి
యేవగింపక, శాంతిమై యెదుగఁ బెంచి,
బిడ్డలకుఁ బూరి తాకిన భీతిఁజెందు
తల్లి మృదులహృదయ మగాధమ్ముఁ దలప!!

గీ॥ తల్లి సహజదయను మించు తత్వమేది?
తల్లి పావనసేవకుఁ దగిన దేది?
తల్లి దీవెన కనువగు ధర్మమేది?
తల్లికంటెను యిహ పర దైవమేది??

# హైందవాచారాలలో విజ్ఞానం పాతివ్రత్యం



● వసంత ●

ఆత్మశక్తిలో అత్యుత్తమమైనది పాతివ్రత్యజనిత శక్తి. కామక్రోధాది వికారాలకు లొంగకుండుట వల్ల ఆత్మనిగ్రహం అలవడుతుంది. ఆత్మశక్తిని సముపార్జించడానికి ఆత్మనిగ్రహమే మూలాధారం. పతిని దైవంగా భావించినప్పుడు కామం నిర్మూలింపబడుతుంది. కామం లేనప్పుడు క్రోధం జనించలేదన్న విషయం అనుభవసిద్ధమే! కామక్రోధరహితమైన జీవిని తుచ్ఛమైన ఐహికవాంఛలు కలతపెట్టలేవు. ఈ విషయం చక్కగా శ్రీమద్భగవద్గీతలో చెప్పబడింది:

"ధ్యాయతో విషయాన్ పుంస స్సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ (గీత. 2. 62, 63.)

"విషయములను ధ్యానించువానికి వానియందు సంగము కలుగును. విషయాసక్తివలన కోరిక పుట్టును. కోరికవలన కోపము కలుగును. క్రోధమువలన అవివేకము కలుగును. అవివేకమువలన స్మరణభ్రంశము లేక మఱపు కలుగును. మఱపువలన బుద్ధి నశించును. బుద్ధి నశించుటవలన తానే నశించును."

పాతివ్రత్య శక్తియొక్క మహత్త్వం పురాణాలలో అనేకవిధాలుగా నిరూపింపబడింది. అందు ముఖ్యంగా గమనింపవలసిన విషయమేమంటే ఆ శక్తికి సాధ్యంకాని కార్యంలేదని, ఆ శక్తికి మేరలేదని, ఆ శక్తియొక్క అపార సామర్థ్యం గ్రహించడానికి ఎట్టెట్టి విషమ సందర్భాలలో, ఎట్టెట్టి క్లిష్టపరిస్థితులలో పతివ్రతలు నిస్సహాయంగా తమ మానప్రాణాలను సంరక్షించుకొన్నారో విచారించవలసి ఉంది. పతివ్రతల చరిత్రలవల్ల మనకు గోచరించేదేమంటే ముఖ్యంగా మూడువిధములైన శక్తులను వారెదుర్కొని జయించగలిగేరని. అవి:

౧. మానవశక్తి; ౨. ప్రకృతిశక్తులు; ౩. మానవాతీతమైన దేవదానవాది శక్తులు.

౧. **మానవ శక్తి:** అడవిలో దమయంతిని విడిచి నలుడు తనదారిని తాను పోయేడు. భర్తృవియోగంచే క్రుంగిపోయి, ఏకాకియై, తెన్నెరుగక అరణ్యంలో దమయంతి తిరుగుతూంది. అట్టి సమయంలో నొక కిరాతుడు ఆమెనుచూచి దుష్టవాంఛ ఉదయించిన పాషాణహృదయంతో ఆమెను బలాత్కరించ పోతాడు. ఆ మదాంధునికి దమయంతి హితబోధ చేస్తుంది. పాపాత్ముడు పరివర్తనమొందడు. గత్యంతరంలేక ఆత్మరక్షణకై శపిస్తుంది. ఆ పాపి భస్మమై నశిస్తాడు. ఒక ముష్కరమానవుని శలభసన్నిభంగా భస్మం చేయగల ప్రభావం పాతివ్రత్యశక్తి కుంది.

మాత్సర్యపూరితుడై గర్వాంధుడైన దుశ్శాసనుడు ద్రౌపదిని నిండోలగంలోనికి ఈడ్చుకొని వచ్చేడు. జూదంలో ధర్మరాజు 'తన్నోడి నన్నోడెనా, లేక, నన్నోడి తన్నోడెనా?' అని ద్రౌపదివేసిన ప్రశ్నకు సమాధానం రాలేదు. ధర్మకోవిదులు చర్చిస్తున్నారు. కాని, సామ్రాజ్యాధినేత దుర్యోధనుడు తమ్మునికి హుకుమివ్వగానే దుశ్శాసనుడు వలువ లూలువ ప్రారంభించేడు. అత్యద్భుత బలపరాక్రమోపేతులైన పాండవులు మంత్రబద్ధ మహోరగములట్లు కూర్చున్నారు. ద్రౌపది తన పాతివ్రత్యశక్తిపై ఆధారపడవలసి వచ్చింది. నిండోలగంలో పాషండుని దుర్నయాలకు మండుచున్న హృదయంతో కృష్ణపరమాత్మను ప్రార్థించింది. మానరక్షణం కావించుకొంది.

౨. **ప్రకృతి శక్తులు:** రాజ్యసర్వస్వం విశ్వామిత్రునికి ధారపోసి ఋణవిముక్తికై హరిశ్చంద్రుడు భార్యాసుతులతో మహారణ్యాలు నిర్గమించి కాశికి పోతున్నాడు. విశ్వామిత్రుని ఈర్ష్యాగ్నియే ప్రత్యక్షమైనట్లు ఒక అరణ్యమధ్యమందు కారుచిచ్చు చెలరేగింది. అందులో వారందరు చిక్కుపడ్డారు. ఆ అగ్ని జ్వాలల నార్పు సాధనం గోచరించలేదు. 'అగ్నికి నే నాహుతౌతా' నంటే 'నేన'ని భార్యాభర్తలు ముందంజవేస్తున్నారు. అప్పుడు చంద్రమతి,

'అకలుషంబగు సత్యమమరు మీరున్న - సకలధర్మంబులు సాగు మీరున్న
పనికిమాలిన నాదు బ్రతుకేమి లెక్క - చననిందు పదివేల జన్మాలకైన
నీవె నా బతిగాగ నిటలాక్షు వేడి - పావకునకు నిచ్చివైతు నా తనువు ||'

అంటూ, అగ్నికభిముఖంగా ప్రాంజలి ఘటించి '...ప్రశస్తోరు సాధ్వీత్వమే నాకు వర్తించునేనిక్ నిమేషంబులోనక్ భవజ్వాలికా జాలముంబాసి శాంతుండవై నవ్యనీహార వాఃపూరముంబోలి శైత్యంబునక్ గ్రాలవే వీతిహోత్రా!...' అని స్తోత్రం చేయగానే అగ్ని చల్లారింది. ఆమె పాతివ్రత్య మహిమకు విశ్వామిత్రుడే ఆశ్చర్యచకితుడైనాడు.

3. **మానవాతీత శక్తులు:** రావణుడు దానవరాజు, పరమనైష్ఠికుడు. పరమేశ్వరునిగూర్చి ఉగ్రమైన తపస్సు గావించి వరాలు పొందేడు; నిరంకుశంగా రాజ్యపాలనం చేస్తున్నాడు. అట్టి రావణుడు సీతామహాదేవిని కొన్ని సంవత్సరాలు చెఱయందుంచినప్పటికి ఆమె నొక్కసారిగూడ తాకలేకపోయేడు. దేవతలను ధిక్కరించు రాక్షసరాజును ఆమడదూరముంచగలిగింది సీతాదేవి పాతివ్రత్య ప్రభావమే!

కలలో వరించిన సత్యవంతుని వివాహమాడింది సావిత్రి. అల్పాయుష్కుడని తెలిసినప్పటికీ సత్యవంతునే గాని అంగీకరించిందికాదు. వివాహమైన సంవత్సరంలోపుగా నట్టడవిలో హఠాత్తుగా సత్యవంతుడు మృత్యువువాతపడ్డాడు. అతనిప్రక్కనున్న సావిత్రికి తోడ్పడువారు లేకపోయేరు. భర్త ప్రాణ రక్షణార్థం యముని వెంటపడింది సావిత్రి. రెండువరాలు ప్రసాదించేడు, భర్త ప్రాణాలు తప్ప. ఆమెకు సంతుష్టిలేదు. కంటకభూయిష్టమైన మార్గంలో నిరపాయంగా యాత్ర సాగిస్తూంది. యమధర్మరాజు పలువిధాల బోధించి, వెనుతిరిగిపొమ్మని చెప్పినా వినదు. ఆమె మానసికవేదనకు యముడు తహతహలాడి, ఆమె పాతివ్రత్య ప్రభావానికి దోసిలొగ్గి తుదకు సత్యవంతుని పునర్జీవితునిగా చేయక తప్పిందికాదు. యముని ప్రతిఘటించింది సావిత్రీ పాతివ్రత్యం!

# స్త్రీలు - వ్యవసాయం

శ్రీమతి కె. సుగుణమణిగారు

'స్త్రీలు - వ్యవసాయం' అనగానే - స్త్రీ యేమిటి? వ్యవసాయమేమిటి? రెంటికి ఎక్కడి సమన్వయం అని ఆశ్చర్యం కలగొచ్చు!

'స్త్రీ' అంటే సృష్టికి మూలకందం. 'ప్రకృతిః కర్త పురుషస్తు పుష్కరపలాశవన్నిర్లేపః' అనే సాంఖ్యమతసూక్తి ప్రకృత్యంశమగు స్త్రీ యౌన్నత్యాన్ని ఎలుగెత్తి చాటుతూంది. స్త్రీకి సృష్టిలో ప్రధాన స్థానమీయబడింది. త్రిమూర్తులుగూడ స్త్రీ మూర్తికి జోహారొనర్చవలసినవారే. స్త్రీ మూర్తిలో సృష్టి కార్యాన్ని యిమిడ్చి భగవంతుడు ఆమెకు అసమాన గౌరవం కలుగజేసేడు. స్త్రీ లేనిదే సృష్టిలేదు. సృష్టి అంటే నూతనత్వం గలిగించే ప్రతీకార్యం సృష్టే. అదివరకు మొద్దురూపంగానున్న పదార్థానికి వికాసం కలుగజేసే నూతన పరిణామమే 'సృష్టి'. దీనికి స్త్రీ పురుష స్వరూపాలలో యుండే యిరువురి తోడ్పాటు వుంది. ప్రకృతి పురుష శక్తుల కలయికవల్లనే పిపీలికాది బ్రహ్మ పర్యంతము గల సమస్త ఫలవృక్షాదులు జీవరాసులు, పుడుతున్నాయి. కాని కొంతమంది స్త్రీలకు తమ శరీరంలోనుండి రక్తమాంసాలు పంచిపెట్టి శిశువుల్ని ప్రపంచంలోకి తీసుకరావడం, వాళ్లనుపెంచి పెద్దల్నిచేయడం ఆదిగాగలపనే ఒకముఖ్య వృత్తిగాను, సృష్టిగాను కనబడుతూంది. ప్రతి సృష్టికార్యంవల్లా ఒక ఆనందం ఉన్నట్లే యిందులోనూ చాలా ఆనందం ఉంది. (కాని నలుగురు పిల్లల్ని కనేసరికి ఎక్కువ చక్కెర తింటే వెగటు పుట్టినట్లు, వెగటు కలుగుతుంది. కాబట్టి దీనిని కొంత సడలించి నూతనవికాసం కలుగడానికి ఆనందం కలుగజేసే మరో సృష్టి కార్యం ఒకటి ఉండాలి.)

ఉంది! అలాంటి సృష్టి కార్యం (వ్యాపకం) ఒకటి భగవన్నిర్మితమయ్యేవుంది. భగవంతుడే యీ పనికి కూడా మానవశ్రేయస్సుకోసం అనాదిసిద్ధంగా యేర్పాటుచేసి ఉంచేడు. కాని నాగరికత బలిసిన కొద్దీ దీనిపై కొందరికి అశ్రద్ధ యెక్కువౌతూంది. చైతన్యరహితంగానున్న విత్తనాల్ని నాటి వాటికి నూతన ఫలపుష్పవికాసం పరిణామం కలుగజేయడంకూడా సృష్టికార్యమే. ఈ కృషిలోనే మన ఆరోగ్యం, అభివృద్ధి, ఆనందం అన్నీ యిమిడివున్నాయి. ప్రపంచాన్ని పోషించే ప్రాణకృషి, జీవంతో చెలగాటమాడే జీవకృషి, అందరికీ అన్న వస్త్రాదులిచ్చి పోషించే ఆదికృషి, మాతృగర్భంతో పోల్చదగు మాతృకృషి.

నూత్న వస్తువుల్ని సృష్టించడంలో స్త్రీకి వ్యవసాయానికి సన్నిహిత సంబంధమే ఉండనాలి. యీ రెండింటి పుట్టుపూర్వోత్తరాలు కొంత విచారిద్దాం. ఎందుకంటే ప్రతీమనిషికీ యీ రెండింటితోటీ కొంత సంబంధం ఉంది. కొంతగాదు, అసలు మనిషియొక్క ఇహలోక జీవనానికీ పరలోకజీవనానికి ఉన్న సంబంధమంతా వీటితోటే వుంది.

అసలు, 'స్త్రీ' 'వ్యవసాయం' ఇవి ఏలా పుట్టేయీ? ఎందుకు పుట్టేయీ?, అన్నప్రశ్నే రావచ్చు!

స్త్రీ పుట్టుకను గురించి కొన్ని వింత కథలున్నాయి. ఇంగ్లీషువారి శాస్త్రంలోన వారు చెప్పే దేమిటంటే స్త్రీ పురుషులిద్దరూ ఒకరికొరకొకరు సృష్టింపబడ్డారని పరస్పరసహాయం లేక యిద్దరూ జీవయాత్ర సాగించలేరని వారిప్రేమయే మానవసృష్టికి మూలమని అన్నారు. 'ప్రేమమున లోక ముదయించెనేమో'అని కవివాక్కు. వేదాలు, 'పురుషుడు' స్త్రీకి 'మిత్రు'డనిన్ని 'స్త్రీ' పురుషునకు 'సఖి'యనిన్నీ చెప్తున్నాయి. 'అర్థం భార్యామనుష్యస్య భార్యాశ్రేష్ఠతమ సఖా'అన్నారు. భార్య పురుషునికి అర్థ

శరీరం, స్నేహితులందరిలోను ఉత్తమ స్నేహితురాలు అన్నమాట. స్త్రీ పురుషునికి అర్ధాంగి. శరీరంలో ప్రశస్త అర్ధభాగం (Better half). ప్రకృతి పురుషుల పరస్పరసంబంధమే భార్యాభర్తల ప్రేమానుబంధమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అంతేగాదు. ఋగ్యజుర్వేదాల్లో స్త్రీ 'ఉష'తో సమానంగా అంటే జీవితానికి ప్రభాతం, వెలుగు కూర్చేదిగా వర్ణింపబడింది. అనాది దంపతులైన పార్వతీపరమేశ్వరులనుండి, మానవుల సంసారానికి జీవితాలను ఊతగొమ్మలైన పౌరాణికదంపతులు, సీతా-రాములనుండి ప్రజాకుటుంబిక జీవితాలకు దివిటీలైన సావిత్రి, దమయంతి, చంద్రమతి, మొదలైన భారతనారీమణులనుండి చారిత్రాత్మకంగా వాసిగాంచిన రాణీ సంయుక్త, ఝాన్సీ, చాంద్ బీబీ, ఖడ్గతిక్కనసతి, రుద్రమాదులనుండి సారస్వతదృష్టిలో సమున్నతికెక్కిన మొల్ల, తరిగొండ వెంకమ, ముద్దుపళన్యాదులనుండి కూడ స్త్రీ మూర్తి అఖండంగా ఆరాధింపబడుతూనేఉంది. "రమ్యా రామా యదుకుల వధూస్త్యాగభోగాయవిత్తం వక్రపాణీ సరసకవితా శంకరే చిత్తవృత్తిః సద్భిస్సంగర్వపుషిదృఢతా సత్కులే జన్మపుంసా ధిక్ ధూరాధనశనపదమ్ స్వర్గమేకాంత దుర్గమ్'అన్న పల్కులలో ఇల్లాలికెంత ప్రాధాన్యమీయబడిందో తెలుస్తుంది.

'ఉత్తరరామ చరిత్ర'లో భవభూతి 'ఉత్సృజ్యప్రియ గృహిణాం గృహస్య శోభాం' అనిన్నీ స్త్రీయే సంసారానికి 'మూలకందం ముకుందమ్' అనిన్నీ స్పష్టపరిచేడు. కాళిదాసుకూడా గృహిణి ధర్మాలు ఆమెకుండే గౌరవస్థానం అక్కడక్కడ ఏకరుపెట్టేడు. 'గృహిణీ గృహముచ్యతే'అని యింటికిన్ని యిల్లాలికిన్ని అభేదాధ్యవసాయం చేసేరు. చారిత్రకంగా చూస్తే హిందూ విజ్ఞానం 3,500 సం॥రల నుండి వ్యాప్తమున్నట్లు తెలుస్తుంది. ప్రథమయుగం వేదయుగం అనొచ్చు. అప్పుడు స్త్రీలు పురుషులతో సమానంగా వేదాధ్యయన చేసేవారు. క్రీ॥ పూ॥ 500 సం॥రం॥ ప్రాంతంలో యీ యుగం అంతరించింది. అప్పటినుండీ రెండవయుగం అనొచ్చు. యీ యుగంలో స్త్రీల ప్రతిపత్తి అనేకకారణాలవల్ల క్షీణించింది. కాని సర్వకాల సర్వావస్థలయందును మానవజాతికి ఉత్తేజం కలిగించేది స్త్రీలే యని చెప్పేరు. మన హిందూదేశ స్త్రీలకుండే గౌరవాన్నిగూర్చి పాశ్చాత్యులు ఆశ్చర్యపడేవారు.

'ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతంపితా సహస్రంతు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే' అన్న మనుధర్మసూక్తి చూడండి, మాతృదేవి కెంత గౌరవస్థానం కలిగించేరో!

ఇంటి కీర్త్యపకీర్తులు గూడ స్త్రీలపైననే ఆధారపడియున్నాయి. 'అతత ధర్మార్థసుఖఖ్యాతులు సద్భార్యవలనగాదే కలుగున్'అని భారత స్త్రీకిగల బాధ్యత తెలియపరుస్తూంది. సంసారమనే నావకు స్త్రీ చుక్కానివంటిది. నౌకాగ్రహాన్నిబట్టి ఓడ దాని మార్గాన్ని గుర్తించినట్లు స్త్రీనిబట్టియే సంసారం మంచి మార్గంలో నడుస్తుంది. ప్రతీమనిషిని కని పెంచేది స్త్రీ. సద్బుద్ధులు గరపేది స్త్రీ. మరల పురుషుని ప్రేమించి సుఖాబ్ధి నోలలాడించేది స్త్రీ. మాతయై, భార్యయై పురుషులకేలోటు రాకుండజేయగలది స్త్రీ. 'అఖిలపురాణేతిహాసములకు మూలకందమువై జగముల సృజించి వృద్ధినొనరించి హత మొనరింతు నీవె 'స్త్రీ'యనెడి పేర సంకల్పసిద్ధురాల!'అని స్త్రీ జగత్కార్యకలాపానికి మూలహేతువని చెప్పేరు. ఏ గ్రంథం పరికించినా స్త్రీలు సర్వవిధాలా పురుషుడికి తోడ్పడుతూ అతడు సల్పే ప్రతికృషిలోను సహాయం అవుతూ ఉండేదన్న విషయం విశదమౌతుంది. చేదోడు వాదోడు ప్రవర్తించింది యీ సాధ్వి.

ఇఁక సాధారణ కుటుంబీకులను చూడండి. స్త్రీ సర్వకార్యాలలోను భర్తకు సాయంచేస్తుంది. భర్త ప్రొద్దుటే పొలంవెళ్తాడు; భార్య అతనికి చద్దిఅన్నం తీసుకవెళుతుంది. అతఁడు భోంచేస్తుంటే కూలీలతో కలసి పనిచేస్తుంది, చేయిస్తుంది. వ్యవసాయంచేసేవాడు పురుషుఁడైనా అన్ని పనుల్లోను స్త్రీసహాయం వుంది. వూడ్చేవారు స్త్రీలు, కోసేవారు స్త్రీలు, పురుషుఁడు పంట యింటికిదెచ్చి పడవేస్తే మరల వాటిని పలపరచుకొనేది స్త్రీలు. కూరగాయలు ఇంటికిదెస్తే, తరిగి, తయారుచేసి భర్తకు బిడ్డలకు బెట్టేది స్త్రీ. పాలు యింటికితేగానే కాచి, పెరుగు మీగడ నేయి చేసేది స్త్రీ. సర్వత్రా ఆమెయే గృహాధికారిణి. భర్త ఏపని చేయవలసింది, ఏ పొలంలో ఏది వేసేది ఆమె సలహాపొంది చేస్తుంటాడు. సలహాయిచ్చి నడిపింపగల సామర్థ్యం ఆమెలోఉంది; పలపరచి పెట్టగల సామర్థ్యం ఆవిడదే. ఏ గింజలు, విత్తనాలు ఎలా జాగ్రత్త చేసుకోవాలో అన్నీ తను చూచుకుంటుంది. కొన్నిట్లో బూడిదకలిపి, కుండలు, తట్లలో, వేసి, మెత్తుతుంది. కూరగాయల విత్తనాలైతే ఎండు కాయల్లోనో, పిడకల్లోనో వేసి దాస్తుంది. సరియైన ఋతువురాగానే దొడ్లో వేస్తుంది; భర్తకిచ్చి పొలంలో వేయిస్తుంది. ఈ విషయాలలో స్త్రీయొక్క సామర్థ్యం, చాకచక్యం, చూచినవాళ్లకే తెలుస్తుంది. ఆమెకు సహజంగా అలాంటి అభిలాష, సామర్థ్యం ఉందని అనుకోవాలి. చూడండి, పార్వతికూడ ఏమంటుందో భర్తనుచూచి—

సీ. "ఒక్కింత మడిమాన్య మొసఁగడే రాముండు, చెరకువేరుఁడు బీజములకు లేడె
కావలెనన్న నాగలి బలుండేయఁడే, కర్రుగా శూల మక్కరకురాదె?
అడిగినఁ మహిషంబు నంపఁడే ధర్ముండు, జతసేయ మన మహోక్షంబులేదె?
చేని కన్నము దేరనైననోపనే, గొడ్డేలుటకు షణ్ముఖుండు లేడె?

గీ. ఏల పరివారిలో నవ్వులాటనాకు, మానుమికనైన బిచ్చాలుమారి బ్రతుకు!
కడఁగి కృషిసేయు మనుచు నెప్పడు నిజేశు హెచ్చరించెడి గౌరి......"

ఇందులో హంశాలు చాల హృదయరంజకంగా వుంటూ, స్త్రీకి మంత్రివలె భర్తకు సలహా యివ్వటంలో గలనేర్పు, పొలంలోఉండే భర్తకు తాను అన్నం తీసుకవెళ్లాలనే అభిలాష, చాల అనూన్యంగా చిత్రింపబడ్డాయి! ఏరీ? ఇలాంటి సలహాలిచ్చే భార్యలు మన నవనాగరీకులలో (అంటే, పట్టణ వాసుల్లో) ఉన్నారా?

భర్తతో కలసి, ప్రకృతి మధ్య పొలాల్లో కష్టపడుతూ—పంటలు, పాడి పశువులతో నూత్న సృష్టికి తోడ్పడుతూ ఆనందించే స్త్రీలకుండే ఆనందం మనలో ఎవ్వరికైనా ఉంటుందా? అంతెందుకు? ఉషః కాలాన్నేలేచి, నిత్య కృత్యాలు దీర్చుకొని, పనిపాటులు జేసుకొను స్త్రీకిగల మనోవికాసం, ఆరోగ్యం, చురుకుదనం-సూర్యోదయాత్పరము ఏ 8 గంటలకోలేచి, ఇస్సురంటూ కాలుచేతులు కదల్చుకొని బెడ్ కాఫీలు, టీలు త్రాగే మన నవనాగరీకుల కుంటుందా?

ఇఁక వ్యవసాయంయొక్క పుట్టు పూర్వోత్తరాలు కొంత చూద్దాం. పూర్వం అడవిమనిషి వేటాడి ఆహారం సంపాదించుక బ్రతికేవాడు. క్రమంగా అతఁడు నాగరీకుఁడైనకొద్దీ వేట తగ్గి, వ్యవసాయం ప్రాధాన్యతలోకి వచ్చి, నాటికిని నేటికిని మాతృకృషి అయింది. ఆర్యులు గోగణాలు సాకుచు, కందమూల వన్యఫలాలు భక్షిస్తూ, ఆహారార్థము సస్యములుకూడ పైరుజేసుకుంటూ, మిగత కాలాన్ని జ్ఞానార్జనానికి

వినియోగించేవారు. తమ సస్యాలు, సర్వజీవరాసులు చక్కగా సాకబడగలందుకై ఇంద్రవరుణాది దేవతలను వారు గావించే ప్రార్థనలు ఋగ్వేదంలో గానవస్తాయి. తనకు అన్నవస్త్రాదులు యిచ్చి పోషించే వ్యవసాయ కృషిని Necessity is the mother of invention అన్న చందాన్ని మానవుఁడు అభ్యసించేడు; భార్య సహాయం పొందుతూ, ప్రకృతినుండి తనకు కావలసిన అన్నవస్త్రాదులు, ఫలపుష్పాలు వగైరా అన్నీ పైరుజేసుకొనేవాడు. వ్యవసాయం అంటే సామాన్యకృషి అనుకున్నారా? అది సృష్టికార్యంతో సమానమైంది. పంచభూతాలతోగూడినపని అది. ఒక్కొక్క మొక్క ఒక్కొక్క బిడ్డతో సమానం. జీవాలున్న మొక్కలు జంతువులతో పని గనుకాను, మనఅందరి జీవధారలకు ఆధారభూతమైంది గనుక దాన్నిజీవకృషి అన్నారు. అందులో ఎంత ఆనందం ఉంది! ఎంతసౌఖ్యంవుంది! ఎంత స్వార్థత్యాగం, ఎంత నిష్కామకర్మ ఉంది! ఒక్కసారి ఆలోచించి చూడండి; అన్ని కృషులకూ మూల కృషియైన మాతృకృషిగదూ అది? అటువంటి కృషిని నిర్లక్ష్యంగా చూచేమంటే-మన ఆరోగ్య సౌభాగ్యాలను గురించి ఆలోచించుకోని మందమతుల మన్న మాట. ఈ కృషిలోగూడ స్త్రీ సహాయం సర్వత్రా కావాలి. ఈ విషయం స్త్రీలు గమనించాలి. ఆమెకు వివేకరేకలు రేకెత్తించాలి; స్త్రీ తాను శక్తి స్వరూపిణినని, సృష్టిఅంతా తన లీలావిలాస ఫలితమేనని గుర్తించాలి. తనకు సృష్టికర్త ప్రసాదించిన అమోఘశక్తులను ఉత్తేజింప జేసుకొని సక్రమంగా ఉపయోగిస్తే స్త్రీ మూర్తి చేయలేని కార్యమేమీలేదని తాను తెలిసికోవాలి.

ప్రపంచమంతా స్త్రీయొక్క సంతానం. ఆ మాతృమూర్తికి దుర్ఘటమేమీలేదు. తలుచుకుంటే ప్రపంచాన్నంతటినీ ఆనందమయంగా చేసివేయగలదు. ఆమె సంకల్పసిద్ధురాలు! తల్చుకోవాలి; ఆమెకు యిదమిద్ధమని బోధపడాలి; వివేకం కలగాలి. సద్వివేకం కలగాలంటే సద్విద్య అవసరం. 'చదివినఁ సద సద్వివేక చతురత గలుగున్' బాల్యంనుండే చక్కటి తరిఫీతు అవసరం. 'విద్య' అంటే ఇప్పటి విద్యకాదు. భుక్తి, యుక్తి, శక్తి, రక్తి, భక్తి, ముక్తిదాయకమైనదే నిజమైన విద్య. విద్య అంటే ఏమిటి?—శరీరాన్ని ఎట్లు రక్షించుకోవాలి, మనస్సునెట్లు పోషించుకోవాలి, వ్యవహారముల నెట్లు నిర్వర్తించాలి, బిడ్డల పాలన పోషణ యెట్లు జేయాలి, సార్వజనిక జీవితమందెట్లు ప్రవర్తించాలి, ప్రకృతి తనకు ప్రసాదించిన సౌఖ్యసాధనాలను ఎట్లు ఉపయోగించుకోవాలి, తనకు పరులకు అత్యంతంగా ఉపయోగించే రీతిని తన శరీర మానసికశక్తుల నెట్లు సద్వినియోగపరుచుకోవాలి, సర్వతోముఖ సుందరజీవితానికి పునాదివేయుట యెట్లు, ఇహలోక భయ విషాదాదులనుండి విముక్తినంది నిత్యానంద సుఖశాంతుల చంద మరయగలుగుటెట్లు అనే విషయాలు నేర్పేదే 'విద్య'.

సంఘాన్నంతా ఉద్ధరించనక్కరలేకపోయినా తన సంసారాన్ని ఆనందమయంగా చేసుకోగల సామర్థ్యం కలిగించే విద్య, తన భర్తకు 'కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ' అన్న చందంగా ఉపకరించగల సామర్థ్యం కలిగించే విద్య - స్త్రీకి చిన్నప్పటినుంచీ నేర్పాలి. సంసారాన్ని ఉద్ధరిస్తే సంఘాన్ని ఉద్ధరించినట్లే. సంసారమంటే ఏమిటి? సంఘంలో ఒక చిన్నభాగం (unit) సంసారం. సంసారాలు చక్కబడితే సంఘం దానంతట అదే చక్కబడుతుంది. 'ఏరాజ్యంబున దరుణులు దారు కళాకుశల సుస్వతంత్రులు గలరో ఆ రాజ్యంబున బురుషులు, ధీరులు నధికారు లమలధీసువిచారుల్' అని ఇదివరలో మనవిజేశాను.

ప్రజల ఆనందాభివృద్ధులకు తాను కారకురాలయినట్లే - ప్రజల ప్రాపంచికజీవనం, ఆహారం, 'కృషి - కృషికుల' మీద ఆధారపడివుందని ఆమె గ్రహించాలి.

నిజంగా చూస్తే 'స్త్రీ' వలెనే కృషికుడుగూడా అందరికి ఆరాధనీయుఁడు కాడూ! అతఁడొక నిష్కామకర్మి. అందులకే కృషికుఁడున్నచోట భగవంతుడున్నాడని కవిసార్వభౌముడగు రవీంద్రనాథ ఠాకూరు మహాశయుడు తన 'భక్తిప్రబోధం' లో ఇలా వ్రాశాడు:—

"జపతపంబులు గానముల్ - చాలు జాలు,
నన్నితలుపులుమూసి యీ - యాలయమున
జిమ్మచీకటి గొందిలోఁ - జేరి యిట్టు
వొంటి నెవ్వని బూజించు - చుంటి విపుడు?
తెరచి కన్నులఁ జూడుము - దేవుఁ డెదుట
గానవచ్చునో లేదో - నీ కన్నులకును?
గట్టియౌ భూమి దున్నెడు - కాపువాడు
కష్టపడుచోట నాతడు - గలడు, చూడు!"

కాని, యీ మాతృకృషి, యీ కృషి సల్పే కృషికుని స్థితి అంతకంతకు దీనస్థితికి వస్తూంది. దీనికి అనేక కారణాలున్నాయి. ఒకటి—మన విద్యాధికులంతా వీటి ఆధిక్యతను గమనించి, తగినశ్రద్ధ తీసికోక పోబట్టి. ఆంగ్లకవి గోల్డ్‌స్మిత్ ఏమంటాడో చూడండి:—రైతు దేశానికి వెన్నెముకవంటివాడని, దేశానికి రాజు కరువైతే సులభంగా ఇంకోరాజును తేవచ్చును గాని, జాతికి వెన్నెముకయైన రైతు నశించాడంటే దేశం నశించవలసిందేనని.

మనకందరికి శరీరపోషణార్థం చైతన్యశక్తి, జీవశక్తి శరీరంలో ఉండాలంటే ఇంజనుకు బొగ్గులాగునే అందరికీ ఆహారం అవసరం. ఆహారంలోకి ఈ శక్తి ఏలావచ్చింది? సూర్యుణ్ణుంచి వచ్చింది. సూర్యుడుయొక్క కాంతిలోనున్న శక్తిని రైతు పెంచే మొక్కలు తీసికొని, ఎదిగి, ఆకులలోనో, దుంపలలోనో, గింజలలోనో దాచి ఉంచుతూంటే - వాటిని మనం భుజిస్తూ, ఆ శక్తిని ఉపయోగించుకొని బ్రతుకగలుగుతున్నాం. ఈ ఆహారసృష్టీ, సంపాదనా అంతా రైతుపైన, పురుషుడిపైన పడేసి మనం హాయిగా కూర్చుంటున్నాం. స్త్రీలు యీ శ్రమ కొంచెం పంచుకోవాలి. పురుషుడికి పూర్వం చక్కగా స్త్రీ అన్నిపనుల్లోను చేదోడువాదోడై యుండేది. ఇప్పటికీ కొన్ని కుటుంబాల్లో ఉంది, యీ శ్రమవిభాగం.

వ్యవసాయం బాగుంటేనే మనం, మన పిల్లలూ, సుభిక్షంగా బ్రతుక వీలవుతుంది. కనుక స్త్రీలు యీ విషయంలో తగు సానుభూతి చూపాలి. మాతృదేవత అని తమకున్న ప్రాధాన్యంవంటిదే మాతృకృషియైన వ్యవసాయానికుందని గ్రహించాలి. దేశం బాగుపడాలంటే స్త్రీలు బాగుపడాలి; వారి విద్యావిధానం, దృక్పథం మారాలి; దానితోబాటు వ్యవసాయం బాగుపడాలి. గృహలక్ష్మి, గృహం, బాగుపడితేనే దేశం బాగుపడుతుంది; నిత్యకల్యాణం పచ్చతోరణంలాగ వర్ధిల్లుతుంది.

'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్నారు పెద్దలు.

# అశ్రుతర్పణం

## శ్రీ పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు

[చిన్నతనాన్నే - అశుభమూ శుభమూ తెలియని ప్రాయాన్నే - తన భర్త పోయాడని ఎరుగని, ఓ బాలిక అమాయికంగా ఆడుకోటం చూసి—]

పొద్దు పొద్దునె
పొన్నపూలను
అద్దమందున
దిద్దుకొందువు!
ఎవరికోసరమింత?
ఎందుకోసరమింక?

వెలులగూడుక
చెలువువిరాజగ
చిట్టిబొట్టును
పట్టబోదువు!
ఎవరికోసరమింత?
ఎందుకోసరమింక?

చిన్నినాథుని
చిత్రపటమును
పొన్నపూలతో
పూజసేతువు!
ఎవరికోసరమింత?
ఎందుకోసరమింక?

ఆటలందున
అలగుబోడులు
నాథునడుగగ
నవ్వుకొందువు!
ఎవరికోసరమింత?
ఎందుకోసరమింక?

# జ్వాలనా!

## శ్రీ శ్రీరంగం నారాయణబాబు

జ్వాలనా!
జ్వాలనా!
వేదన రగిల్చి
విశ్వం పగిల్చి
వెలిగింపుము
మా వేడినెత్తురుల.

రాగంలేని
భోగవస్తువట
గుడ్లను పొదిగే
పిల్లల కోడట
మాటతప్పని
మగువ బానిసట
అమాయకాత్మల
బాలలు అంటూ
అబలలు అంటూ
శిలలు అంటూ
మగడే ప్రాపంటూ
సిగ్గువీడని
చిరుతప్రాయమున

మొగ్గే తొడుగని
మొలక వయసులో
పాలే లేని
మూలాలినిగా చేసి
కుందనమె పూసి
వధచేసి
వంటిని పసుపు తీసి
ముఖాన్ని పూసి
వళ్లు తెలియక
పళ్లు కొరుకుతు
నృత్యంచేసె
రాక్షసి సంఘపు
కీలాలమ్మె తైలమ్ముగ
జీవనమె వత్తిగ
రుధిరజ్యోతై వెలిగింపుముర!
విప్లవగీతై వినిపింపుముర!
జ్వాలనా!
జ్వాలనా!

# "సంఘసేవాపరాయణి" చుండూరి రత్నమ్మ జమీందారిణి

కర్నూలుజిల్లా వైశ్యమహిళాసభ (నంద్యాల) అధ్యక్షతవహించియు, అగిరిచినసిద్దప్పగారి ధర్మనిధి వార్షికోత్సవము (బళ్లారి) అధ్యక్షురాలుగను చేసిన ఉపన్యాసములలోని భాగములు ఆర్యవైశ్య స్త్రీలకేగాక ఆంధ్ర స్త్రీ లందరికీ హితవచనములు కాగలవు:—

"సమస్తస్త్రీలోకముతోపాటు మన వైశ్యస్త్రీలుగూడ అభ్యుదయమునకు రావలయునని నా సంకల్పము.

ప్రపంచములోని ఇతర దేశముల స్త్రీలు పురుషులకన్న ముందంజవేసి నిరుపమానమగు శక్తి సామర్థ్యములతో దేశసేవ జేయుచున్నారు. స్త్రీలులేని సంస్థలుగాని వారికి దూరమగు కార్యకలాపములుగాని కాన్పించవు! వారు గొప్ప విద్యావంతురాండ్రు, ధైర్యసాహసములకు వారెవరికిని వెనుదీయరు. తీవ్రమయిన సంకల్పము వారియందు గలదు. యుద్ధముజరుగు దేశములలో పురుషులు రణరంగమున పోరాడుచుండ స్త్రీలు నేడు పురుషులుచేయు సమస్త కార్యకలాపములలోను నిరుపమాన త్యాగశీలములతో దేశసేవ జేయుచున్నారు.

మనదేశము సమస్తవిధముల అధఃపతనములో నున్నది. అందు భారతస్త్రీలు అజ్ఞానాంధకారములో యున్నారు. ఇక మన ప్రాంతములోని ఆర్యవైశ్య సోదరీమణుల స్థితి సమస్తవిధముల ఎటులున్నదో వేరుగా జెప్పనక్కరలేదు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లేయ, హిందీ భాషలలో గొప్ప ప్రావీణ్యముగల స్త్రీలు మనలో నెందరు గలరు? పేరునకు ఏకొద్దిమందో కనబడెదరు. విదేశ యాత్రలువెళ్లి వివిధదేశముల, ఖండముల నాగరికతను, వికాసమును చూచివచ్చిన సోదరీమణు లెందరిని చూడగలరు? మన సంఘాభివృద్ధికొరకు, దేశ సౌభాగ్యమునకయి, విద్యాలయములు సమాజములు నెలకొల్పి సేవజేయు తల్లులెందరు గలరు? ఏ ఉభయభాషా ప్రవీణ విద్వాన్ బత్తుల కామాక్షమ్మగారినో ఒకరిద్దరిపేర్లు చూపెదము, అంతకన్న ఎందరు గలరు?

మన వైశ్యస్త్రీలకు ముఖ్యముగా ఆభరణములయందు అధికప్రీతి. ఇది మంచిది కాదనను... నేడు మనకు కావలసినవి సరస్వతీ ఆలయములు; విజ్ఞానమందిరములు; మనజాతి నుద్ధరించి మన దేశసౌభాగ్యమునకు తోడ్పడు పరిశ్రమాలయములు కావలయును... మనమేమి చేసినను భారతదేశము, మన ఆర్యవైశ్యజాతి ముందుకు వచ్చునట్లు జూడవలయును. అంతేగాని అర్థములేని పిచ్చిపనులజేయుట ఈ కాలమునకు వెగటుగానుండును.

సీత, సావిత్రి, దమయంతి, రాణి అహల్యాబాయి, రాణి ఝాన్సి లక్ష్మీబాయి, రుద్రమదేవి, మల్లమదేవి మొదలగు మహాతల్లులను స్మరింపుడు... లోకరక్షకుడగు... స్వామిని తలంపుడు. మన జాతి ధన్యత గాంచగలదు. మనమౌన్నత్యమునకు రాగలము.

మన సంఘములో అనేకలోపములు గలవు. అవి వేళ్లుపాతుకునిపోయినవి. సంఘ దురాచారములను రూపుమాపినగాని మన ఆర్యవైశ్యజాతికి మోక్షములేదు. నలుగురిలో గౌరవ మర్యాదలుండవు. మన దేశములోని అన్ని సంఘములు మేల్కాంచి అభివృద్ధికి వచ్చుచుండ, మన ఆర్యవైశ్యసంఘము ఇంకను నిద్రపోవుచున్నది. మన బాలికలకు విద్యావికాసములులేవు. కూపస్థమండూకములవలెనున్నారు. తలిదండ్రులు ఎంతమాత్రమును శ్రద్ధతీసికొనుటలేదు. అతిబాల్యవివాహములు గూడ ఈ కాలములో చేయుచున్నారు. వివాహములో వేలకొలది కట్నములను గుమ్మరించుచున్నారు. సంసారములు కూలిపోవుచున్నవి. పేద బాలికలకు, సామాన్యుల సంతానమునకు వివాహమగుట దుర్లభమగుచున్నది. ఈడు, జోడు, సాంప్రదాయమునకు స్థానమివ్వక కట్నపిశాచమునకు సంతానమును బలియిచ్చి మన పెద్దలు దేశము నధోగతిలోనికి తెచ్చుచున్నారు. నిర్బంధ వైధవ్యమను పెనుభూతము మనలో ఆవరించియున్నది. బాలవితంతువులకు ఇచ్ఛయున్న వివాహము జేసుకొనుటకు ఇంకా స్వేచ్ఛలేదు. వివాహములలో వేలకొలది ఖర్చుచేయుచున్నారు. స్త్రీలు ధారాళముగా ధార్మికవిషయములలోను, సాంఘిక సేవయందు, పాటుపడుటకు పురుషులు గృహనిర్బంధము

జేయుచు, తమ స్త్రీలను శృంగారబొమ్మలవలె భావించుచున్నారు. ఇతర పట్టణములు, రాష్ట్రములు, వివిధసంస్థలు చూచి వికాసము పొందుటకు అవకాశములు లేవు. గాన ఈ దురాచారములన్నియు పోవలయును. ఇవి పూర్తిగా నిర్మూలముకాక తప్పదు. అట్లుగాకున్న స్త్రీ సహధర్మచారిణి యను పదమునకు భంగము కలుగును.

స్త్రీ శక్తిస్వరూపిణి యని జగత్ప్రసిద్ధము. పరమేశ్వరుడు శక్తిస్వరూపుడు. జగన్మాతనే మన మారాధించుచున్నాము. జగత్తంతయు శక్తిస్వరూపము. సంసారనిర్వాహణమునకయి నేటివరకు మనయావచ్ఛక్తిని ధారపోయుచున్నాము. ఇంకను అఖండశక్తి మనయందుగలదు. మనలో గల శక్తి, ఓరిమి, నిరుపమానములు. మీరును మనజాతి పూర్వవైభవమునకు వచ్చునట్లు సేవజేయగోరుచున్నాను. జాతీయ సంస్థలకు, విద్యాప్రతిష్టాపనలకు మీరు సర్వవిధముల తోడ్పడగోరెద. మీరందరును దృఢసంకల్పముతో శక్తిపూజచేయండి. ఆ లోకమాతను గొలువండి. మన సోదరీమణులకు, సర్వజనులకు ఉపయోగపడునట్లు స్త్రీలకు పఠనమందిరములు, గ్రంథభాండాగారములు నెలకొల్పవేడెద. స్త్రీ విద్యాలయములు ఈ ప్రాంతములో స్థాపింప అందరిని వేడుచున్నాను. మన స్త్రీలకు ప్రసవ వైద్యాలయములు ముఖ్యముగా కావలసియున్నవి. మన స్త్రీలకు సంగీతమున అభిలాష గలుగుటకు పోటీపరీక్షలనుబెట్టి, బహుమానములిచ్చుచు వృద్ధిజేయవలసియున్నది. అందుకు ఒక సంఘమును ఏర్పరచవలసియున్నది.

రాట్నము పేదలపాలిటి పెన్నిధి. ధనవంతుల కామధేనువు. మన సోదరీమణులందరును రాట్నపు పరిశ్రమాలయములను స్థాపింప కృషిచేసెదరా? 'కదురాడిన కవ్వమాడిన సిరికల్గును, కరువుబోవు' అను గొప్ప ధర్మము గలదు.

స్త్రీలకు అత్యవసరమగు సమయములలో వైద్య సహాయము దుర్లభముగా నున్నది. మానాభిమానములు మంటగలిపి పురుషవైద్యుల పాల్పడవలసిన దుర్గతి గలుగుచున్నది. స్త్రీలను వైద్యురాండ్రుగను, మంత్రసానులుగను, సేవకురాండ్రుగను తర్ఫీదుచేయు వైద్యాలయము మన ఆంధ్రదేశములో నెచ్చటనైన గలదా? లేదని చెప్పుటకు సిగ్గగుచున్నది. మనముచేయు లక్షలకొలది దానధర్మములకు అర్థమేమి? నేను పైన చెప్పిన ధర్మముల ననుసరించి సేవచేయుటకు మన వైశ్య స్త్రీలు పెద్దలు ఏల సంకల్పించరు? వట్టి సభలు రిక్తయుపన్యాసములు, సమావేశముల వలన లాభము గలదా?

భారతమాత బంధవిముక్తి త్వరలోనే కాగలదు. ఆ దినములు సమీపించుచున్నవి...

మీరందరును ఖద్దరు వస్త్రధారణ వ్రతమునుబూన వేడుచున్నాను. హిందీభాషను మన బిడ్డలకు తప్పక నేర్పింపగోరుచున్నాను. మహాత్ముని స్వాతంత్ర్యదళములో స్వాతంత్ర్య సంపాదనకై యోధురాండ్రుగ జేర ప్రార్థించుచున్నాను. రాట్న సుదర్శనచక్రము మీ అందరి గృహములలోను తిరుగుచుండవలయునని ఆశించుచున్నాను.

మన వైశ్యనారీమణులు ముందంజవేసి దేశసౌభాగ్యమునకయి సేవజేయగలరని ఆశించుచున్నాను. మన ఆర్యవైశ్య నారీరత్నములు ఇతర సంఘములకన్న ఏ విషయమునను తీసిపోక దేశసేవచేయుచు దేశములో అఖండ యశస్సు నార్జించెదరుగాక యని కోరుచున్నాను..................................

మా ప్రాంతములో మనవైశ్య స్త్రీలు ఇతరులతోపాటు సమస్తవిషయములలో ముందంజవేయుచున్నారు. సంగీతము, చిత్రలేఖనము, సాహిత్యము, ఆంధ్ర, గీర్వాణ, ఆంగ్లేయ, హిందీభాషలయందు మంచి పాండిత్యమును సంపాదించి దేశహితైక కార్యములలో సేవజేయుచున్నారు. శ్రీమతులు ఉభయభాషా ప్రవీణ బత్తుల కామాక్షమ్మ, ఊటుకూరి కృష్ణకుమారి, నాళం సుబ్బమ్మ, పాదర్తి సుందరమ్మ, కొల్లా కనకతాయారమ్మ మొదలగు ఎందరో వైశ్యనారీమణులు మన సంఘములో గగనమండలములోని తారలవలె ప్రకాశించుచున్నారు. ఏ దేశములో స్త్రీలు వెనుకబడియుందురో ఆదేశము, ఆసంఘము, ఆజాతి, అథోగతిలో యుండునని మనువు చెప్పియున్నాడు. గాన మన స్త్రీలు అభివృద్ధిలోనికి వచ్చుటకు మీరు సంపూర్ణ అవకాశమును యిచ్చెదరని నమ్ముచున్నాను."

# శ్రీ॥ వడ్డాది కమలాదేవిగారి అధ్యక్షోపన్యాస సారాంశాలు

సప్తమ గంజాం మండల మహిళాసభ, బరంపురం

## స్త్రీ స్వాతంత్ర్యము - హక్కులు

"స్త్రీ స్వాతంత్ర్యముగూర్చి మనమెన్నో సంవత్సరాలనుండి పోరాడుచున్నాము. ఎన్నో సభలలో తీర్మానాలు చేశాము. కాని, అవన్నీ తీర్మానరూపంలోనే మారించి కార్యరూపం దాల్చకుండా ఉన్నాయి. స్త్రీకికూడా పురుషునితో పాటు ఆస్తిలో సమాన భాగం రావాలి. అసలు కుటుంబంలో పురుషునికున్న హక్కు స్త్రీకి లేదు. ఏ రకపు స్వాతంత్ర్యమూ స్త్రీకి లేనేలేదు. ఏ కార్యసాధనకైనా పురుషుని ఆలోచన, సాధనసంపత్తి లేనిది, యే స్త్రీయును ఏపనియు చేయలేకపోతున్నది. అంటే, స్త్రీకి బుద్ధిబలం తక్కువ అని కాదు. కాని, ఆ బుద్ధిబలాన్ని అమలులో పెట్టుగునే హక్కు యింకా స్త్రీలకు ప్రసాదించబడుట లేదు. అది మన కందరికీ కావాలి.

'ఆస్తుల పంపకంగూర్చి స్థిరాస్తిమీద స్త్రీకి యేటువంటి హక్కు లేదు.' అని ఇటీవల మద్రాసు హైకోర్టు వారు తీర్పు యిచ్చారు. ఆ ప్రకారం చూస్తే స్థిరాస్తి విషయములో స్త్రీకి ముట్టేది సున్నా అన్నమాట. తండ్రి ఆస్తిలోగాని భర్త ఆస్తిలోగాని స్త్రీకి పురుషునివలె సమాన భాగం ఉండాలి. ఆస్తిపంపకములో సమాన హక్కు మనకుండేటట్లు గట్టిగా ప్రయత్నించాలి. కుటుంబములో పురుషునికి ఎటువంటి బాధ్యతగలదో అటువంటిదే స్త్రీకికూడా ఉంది. సమాన బాధ్యతవహించిన స్త్రీ సమానభాగమునకెందుకు హక్కుదారురాలు కాదు?



శ్రీమతి వడ్డాది కమలాదేవిగారు

గంజాంజిల్లా 7 వ ఆంధ్రమహిళా సభాధ్యక్షురాలు.

## ఆంధ్రరాష్ట్ర ఆందోళన

ఈ ఆందోళన బయలుదేరిన దగ్గరనుండి యిప్పటికి ఎన్నో ప్రత్యేకరాష్ట్రాలు ఏర్పడ్డాయి. ఉత్కళులుకూడా తమ రాష్ట్రాన్ని ఎలాగో సంపాదించుకొన్నారు. మనది ఎంతసేపు ఆరంభశూరత్వం, ప్రయత్నమే కన్పిస్తోంది గాని, వచ్చే సూచన ఏమీ కన్పించడంలేదు. ఆంధ్రరాష్ట్రం లభ్యం కావడానికి భర్తలుగల భార్యలు, బిడ్డలుగల తల్లులుకూడా మిక్కిలి కృషిచేయాలి. ఇప్పుడు గాకపోతే ముందెప్పుడో

వస్తుందనుకోడం మిథ్యావాదం. మనమంతా ఒకటే అనుకోవాలి. మనలో మనకు భేదభావాలు నశించిపోవాలి. ఎక్కువ తక్కువ అనే వ్యత్యాసదృష్టి ఎవ్వరికీ ఉండకూడదు. అన్నిటికీ ముఖ్యం ఐకమత్యం. గనుక మనం అందరం పురుషులతోపాటు ఆంధ్రరాష్ట్ర సంపాదనకు దీక్షవహించాలి.

## అంటరానితనం

మహాత్మాగాంధిగారు యిది రూపుమాసిపోవాలని ఎంతో పట్టుపట్టియున్నారు. మాలవాళ్లు చదువుకోని కారణంచేత వాళ్లను మనం దూరంచేస్తున్నాము. వాళ్లే ఏ డిగ్రీలో పొంది మనపై అధికారులుగా వస్తే, వంగి వంగి సలాములు చేస్తాము. గనుక ఎక్కువ తక్కువలు పాటించకూడదు. దేవునిసృష్టిలో అంతా ఒకటే. ఒకే మానవజాతి వుంది గాని, ఇన్నిజాతులు లేవు. అంటరానిజాతి అనేది మనం స్వార్థపరులమై సృష్టించినదే గాని, భగవన్నిర్మాణంకాదు. వారుగూడా మానవకోటిలోనివారే. వారిని మనం దరిచేరనీయక, వారిచేత సర్వచాకిరీ చేయించుకోడం అర్థంలేని వాదన. వారు శుచిశుభ్రతలులేక అసహ్యంగా ఉంటారని కొందరంటారు. శుచి శుభ్రత లేనివాళ్లు ఒక్క యీ పంచములలోనే కాదు, అగ్రజాతు లనిపించుకున్న బ్రాహ్మణులలోకూడా అటువంటివా రున్నారు. కాని, పుట్టుకతోనే బ్రాహ్మణులైన కారణంచేత వారు ఎంత అసహ్యంగావున్నా అగ్రజాతిక్రిందే లెక్క. వారిని మనపక్క కూర్చోపెట్టుకుంటాము. అంటరానితనం రూపుమాపాలని మహాత్మగాంధి శతవిధాల బోధచేస్తు ప్రయత్నిస్తున్నారు. కాని, యీ అంటరానితనం అనే పిశాచం మన ఆడవాళ్లనే ముఖ్యంగా పట్టుకొని పీడిస్తోంది. ఉపన్యాసాల్లో ఎన్నో వింటారు. కాని, ఆ హాల్లోనుంచి పైకిరాగానే ఎవరి ఆచారం వారిది. అసలు ఉపన్యాసాలిచ్చేవారే చెప్పేదొకటి చేసేదొకటి చేస్తూఉండగా, వినేవారిమాటకేమిటి? ఈ చెవితో విని ఆ చెవిలోనుంచి విడిచేసి వెళ్లిపోతారంటే సందేహంలేదు.

## జాతీయపరిశ్రమలు - ప్రోత్సాహము

దేశీయపరిశ్రమలను ప్రోత్సహించి అభివృద్ధిచేయడం మనందరి విధి (డ్యూటీ.) విదేశీసరుకులను మనం కొంటున్నంతకాలము దేశీయపరిశ్రమలు వృద్ధిలోకిరావు. మనం ఉపయోగించే సబ్బులు, పిన్నులు, స్నోలు, వగైరా టాయిలెట్ సామగ్రి అంతా విదేశీ సరుకే! వాటివల్ల ఉపయోగం శూన్యం. అయినా, సబ్బులతో రుద్దుకుంటేనేగాని తృప్తి ఉండదు. గనుక మనదేశంలోకూడా తయారవుతున్నవాటినే వీలైనంతవరకు కొంటూ భారతపరిశ్రమలను ప్రోత్సహించవలెనని సోదరీమణులనందరినీ కోరుతున్నాను."

రైల్వే స్టేషన్లలో స్త్రీలకు ప్రత్యేకం బుక్కింగు ఆఫీసు ఉండవలెననియు, రైలుబండ్లలో యిప్పుడున్నట్లుగా ఒకటేగాక యింకొకబండి స్త్రీలకు ప్రత్యేకముండవలెననియు, స్త్రీల కంపార్టుమెంటు టికెటు చెకింగు స్త్రీ ఆఫీసర్లే చేయునటుల వారలను నియమించవలెననియు, పర్వదినాలలో సముద్రాలలో నదులలో స్నానాలు చేసేటందుకు స్త్రీలకు ప్రత్యేకంగా రేవులు యేర్పాటుచేయవలెననియు, డాక్టరు పరీక్షకు స్త్రీలకు ఫీజు విధించరాదనియు, ఆడనర్సులను ఆసుపత్రులలో గౌరవంగా చూడవలెననియు, స్త్రీలు ఆరోగ్యధర్మముల ననుసరించి స్నానముచేయుచు పరిశుభ్రముగ నుండవలెననియు, స్త్రీలకు పిల్లలకు ప్రత్యేకం పార్కులుండవలెననియు, కట్నాలు యివ్వగూడదు పుచ్చుకోగూడదనియు మున్నగు విషయములనుకూడా జెప్పిరి.

# సప్తమ గంజాంమండల మహిళాసభ, బరంపురం

## ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి న్యాయపతి రంగనాయకమ్మగారి ప్రసంగ సారాంశాలు

"అఖిలభారత మహిళాసభ డిసెంబరునెలలో రాజమహేంద్రవరములో సమావేశము కానున్నది. అందులకై మనమందరము కూడి, మనకు అత్యావసరమైన సమస్యలను ముచ్చటించుట అవుసరమనిన్ని, అందులకై ఆంధ్రమహిళా సమాజములలో పనిజేయుచున్న స్త్రీ అధ్యక్షతక్రింద మనము ముచ్చటించిన యెడల, మన కార్యక్రమము సఫలముగా జరుగునని యెంచి, నేడు ఈ సభ అధ్యక్షస్థాన మలంకరించుటకు శ్రీమతి వడ్డాది కమలాదేవిగారిని, ఈ ఊరికి (బరంపురం) ఆహ్వానించితిమి.

ప్రస్తుతము స్త్రీలకు కావలసిన సంగతులు ఏమనగా:-

హిందూ లా రిఫారం (సంస్కరణ) అనగా హిందూధర్మ శాస్త్రములో కొన్ని మార్పులు సవరణలు చేయించుట. హిందూస్త్రీకి తండ్రి ఆస్తిలోగాని పెనిమిటి ఆస్తికిగాని హక్కులేదు. ఈ హక్కులు సమర్థించుట మొదటిపని. తల్లి దండ్రుల ఆస్తిలో తమ పిల్లలకు, ఆడువారుగాని మొగవారుగాని, సమముగాపంచి, దాన క్రయ, సత్వాధికార హక్కులు కలిగించుట; ఇప్పుడు స్త్రీధనపు ఆస్తిలోనే ఆడు దానికి దాన, క్రయ, సత్వాధికారములు గలవు. పెనిమిటి ఆస్తిలో హక్కు లేనేలేదు. ఒకవేళ ఉన్నను అది లిమిటెడ్ (పరిమిత) హక్కు, అనగా తన జీవితకాలములో ఆస్తిని తాను అనుభవించ గలుగునుగాని, దాన, క్రయ సత్వాధికారములు లేవు. దీనికి శాసన సభలలో మన స్త్రీసభ్యులచే బిల్లులు ప్రవేశపెట్టించు టయు, ఇటువంటి సభలలో చర్చలు జరిగించుటయు అత్యావసరము.

ఆడపిల్లలకు స్త్రీ స్వాతంత్ర్యము, దేశీయ పరిశ్రమలయందు అభిరుచి, కలిగించే విద్యలను అభ్య సింప జేయుట రెండవది. ఇందుగూర్చి మహాత్మా గాంధీగారు చేయుచున్న పరిశ్రమకు మనస్త్రీ సమాజములు తోడ్పడి ఒక Curriculum విద్యావిభాగ కార్యక్రమం ఏర్పాటు చేయవలెను. ఇందులకై ఒక Course of Studies, ఎనిమిది సంవత్సరములలో విద్య ముగియునటుల జేయుటకు, మనము ఆలోచించవలెను. విద్య ముగియనిదే, పెండ్లిండ్లు తలపరాదు.

స్త్రీజాతి గౌరవమును ప్రతి సంస్థ Institutionలో, ప్రతి సమస్యలోను, సమర్థించుట మూడవపని. హిందూరాజుల పరిపాలనములో, హిందూ స్త్రీజాతి స్థానమర్యాదలు ఎటులుండెనో పరిశీలించుట మనపని. హిందూస్త్రీ ఔన్నత్యము నిరూపించుటకు పాతివ్రత్యము, సత్యము, శీలము, ధర్మ ప్రచారము, శాంత - సహిష్ణు స్వభావము వృద్ధి పొందించవలెను. పురాణములు చదువుట మంచిదే. కళలు పూర్తిగా నేర్చుకొన వలయును. ప్రపంచ స్త్రీలలో హైందవస్త్రీ యొక జాతీయతకు ప్రతినిధి - చిహ్నము. తన జాతీయత వుంచుకొన్న పర్యంతము హైందవ స్త్రీ యని పరిగణింపబడునుగాని లేనిచో ఇప్పటి ఫేషన్లు అవలంబించి Modernise చేసిన యెడల, హిందూస్త్రీ అగుటకు బదులుగా అనేక రూపములు గల స్త్రీ యగుచున్నది! హైందవస్త్రీని తిరిగి సృష్టించుట మన కర్తవ్యమై యున్నది."

# స్త్రీల హక్కులు

## సప్తమ గంజాంమండల ఆంధ్రమహిళాసభా తీర్మానములు

బరంపురంలో అక్టోబరు 3-వ తేదీని జరిగిన సప్తమ గంజాం మహిళాసభయందు శ్రీమతి బొల్లాప్రగడ సీతాబాయమ్మగారిని, రాజమహేంద్రవరములో క్రిస్మసు రోజులలో జరుగబోయే అఖిల భారత మహిళా మహాసభకు గంజంజిల్లానుండి ప్రతినిధిగా ఎన్నికొని పంపుటకు తీర్మానించిరి.

ప్రాపర్టీహక్కుల విషయమై రావుకమిటీవారి సలహాలతో నేకీభవించుచును, ఎన్నికలు సభ్యత్వము మొదలగు సర్వహక్కుల విషయములోను స్త్రీలకు పురుషులతోపాటు సమానహక్కు లుండవలెననియు, మన దేశములో తయారైన వస్తువులనే వాడవలయుననియు, దుస్తుల విషయమై సాధ్యమైనంతవరకు స్వదేశీనే వాడుతు ఖద్దరును ప్రోత్సహించవలెననియు, గ్రామపునర్నిర్మాణ సంఘములు ప్రతిచోటా నెలకొల్పి అందు స్త్రీలు ఎక్కువగా పాటుపడవలెననియు తీర్మానించిరి.

స్త్రీలకు ప్రత్యేకముగా వారికి అవసరమైనటువంటి వృత్తులు కల్పించు విద్యను నేర్పుటకుగాను వెంటనే తగు కళాశాలలను ఏర్పరచవలెననియు, ప్రతిగ్రామపట్టణములందును నిర్బంధోచిత ప్రాథమిక విద్యకు తగిన ఏర్పాటులు చేయుమని ప్రభుత్వమువారిని గోరిరి.

భాషాప్రయుక్త రాష్ట్ర విభజనమునకై షుమారు 25 సం॥నుండి ఆందోళన సలుపుచున్న ఆంధ్రుల కోర్కె ననుసరించి ప్రభుత్వమువారు యికనైనా ఆంధ్రరాష్ట్రము నిర్మింపవలెనని యీసభవారు కోరుతూ ఆంధ్రుల సంఖ్యయు, ధనమును ఎక్కువగాఉన్న ప్రాంతములను ఆంధ్రరాష్ట్రములో సమీకరించుట న్యాయ మని తీర్మానించిరి.

అస్పృశ్యత రూపుమాపుటకు స్త్రీలు తోడ్పడవలెననియు, హిందీని నిర్బంధముగా రెండవభాషగా నేర్పవలెననియు, స్త్రీలకు పిల్లలకు ప్రత్యేకం పార్కులుండవలెననియు, రెళ్లలో స్త్రీలకు ప్రత్యేకసౌకర్య ములు జేయవలెననియు, స్థానిక సంస్థలలోను, అసెంబ్లీలలోను స్త్రీలకు ప్రాతినిధ్యము యెక్కువ గావలెనని కోరుచును మరికొన్ని తీర్మానములు గావింపబడెను.

వక్తలు:- పై తీర్మానము లన్నింటిపై శ్రీమతులు బొల్లాప్రగడ సీతాబాయి, న్యాయపతి చూడా మణి, మిస్ నీలిమాఛటర్జి బి.ఎ, దిగుమర్తి సరోజిని బి.ఎ, వెలువలి రాజాబాయమ్మ (వైస్ ఛైర్ మెన్) పోచిరాజు మంగమ్మ, డాక్టరు బి. సీతాబాయి హెచ్. యం.బి, ఆదుర్తి లక్ష్మీబాయి, (ఎమ్.ఎల్.ఎ.) కె. సీతారామమ్మ, శ్యామల సత్యాబాయి, గంపా శివకాంతమ్మగార్లు ఉపన్యసించిరి. ఈ సందర్భములో యిద్దరు ఆడపిల్లలు పురుషవేషములతో చిన్న ప్రహసనము గావించిరి. తదనంతరము అధ్యక్షురాలికి వందనములతో సభ ముగిసెను.

---

## శ్రీమతి ప్రభల వేంకట సుబ్బమ్మగారి వదాన్యత

రాజమహేంద్రవరమునకు చేరువనున్న ధవళేశ్వరం వాస్తవ్యులైన స్వర్గీయ ప్రభల సుందర రామయ్య బి.ఏ.బి.ఎల్. గారి ధర్మపత్ని ప్రభల వేంకటసుబ్బమ్మగారు, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ఓరియంటలు యిన్స్టిట్యూటువారు తెలుగువిద్వాన్ పరీక్షలో నెగ్గిన ఒక విద్యార్థికి ఒక బంగారు పతకమును ప్రతి సంవత్సరం యిచ్చే నిమిత్తమున్నూ, తిరుపతిలో శ్రీ రామస్వామివారి దేవాలయంలో ప్రతి సంవత్సరం ఒకరోజు బీదల కన్నదానంచేసే నిమిత్తమున్నూ, 1500 రూపాయలు ధర్మాదాయంగా (ఎండోమెంటు) యిచ్చారట. 29-9-1941వ తేదీని తిరుమల తిరుపతి దేవస్థానాల సంఘసభ జరిగిందనీ ఆసభలో ఆ సంఘం వారు కృతజ్ఞతతో యీ ఎండోమెంటును స్వీకరించారనీ తెలియుచున్నది.

# మైసూరు స్త్రీలసభ — తీర్మానములు

గతనెలలో జరిగిన మైసూరు సంస్థాన స్త్రీల మహాసభ (మైసూరు నగరశాఖ) వార్షిక సమావేశములో 14 తీర్మానములు ప్యాసుచేయబడినవి.

రాజకుమారి లీలావతీదేవివారు ఉపపాదించిన ఒక తీర్మానములోని కోర్కె: ఇండియా ప్రభుత్వ కార్యనిర్వాకవర్గమున ప్రవేశించుటకు భారతీయ నారీమణులకు హక్కుండవలయుననియు, ప్రభుత్వవర్గమున మంత్రులుగా నియమింపబడవలయుననియు స్త్రీల తరఫున ప్రతినిధులుగా కనీసము ఇద్దరికయినా స్థానమీయబడవలయునని ఈ తీర్మాన సారాంశము.

శ్రీమతి తంగమ్మాళ్ గోపాలయ్యంగార్ సతి ఉపపాదించిన తీర్మాన సారాంశము: ఈ సభా సభ్యురాండ్రందరునూ కలసి ఒక పద్ధతిగా పనిచేయుటకు తగిన ప్రోత్సాహము మార్గదర్శకత్వమునొసగుటకు కన్నడము ఇంగ్లీషు భాషలలో నిర్వహింపబడు ఒక పత్రికను ప్రారంభింపవలయునని. తెలివయిన స్త్రీలూ, స్వతంత్ర ఆలోచనలుగల స్త్రీలూ చాలామంది ఉన్నారుగాని అందరును ధైర్యముగా ముందుకువచ్చి సభావేదికలమీద ఉపన్యాసాలు చేయజాలరనీ, అట్టివారంతా తమ అభిప్రాయములను అనుభవములను వెల్లడించుటకు అవకాశమిచ్చుటకే యిట్టి పత్రికా ప్రారంభము అవసరమనీ, దీనిని బెంగుళూరునుండియే ప్రచురింపవలెననీ, స్త్రీలసభాశాఖలున్న అన్ని మైసూరు ప్రాంతములకు పంపవలయుననీ, సభ్యురాండ్రనుండి యిందుకూర్చి కొద్ది చందా వసూలు చేయవచ్చుననీ, ఈమె చెప్పినది.

బాలికల విద్యాలయములలో నేటి వైద్యపరీక్ష పద్ధతిని ఈమె ఆక్షేపించినది. ఇట్టి వైద్య పరీక్ష బాలికల ఆరోగ్యకాంక్షతో ప్రతీ సంవత్సరమూ కనీసము రెండుసార్లు అయినా జరుపబడవలెనని ఈమె హెచ్చరించెను.

మైసూరు మహారాణీవారి ఉన్నత పాఠశాలలో విద్యార్థినుల సంఖ్య పెరిగిపోవుచున్నందున, పాఠశాలను విస్తరించి తరగతులను హెచ్చింపవలెనన్నది ఇంకొక తీర్మానము. మైసూరు నగరములో స్త్రీ విద్య కొఱకున్నది ఈ ఒక్క హైస్కూలేనట. ఇరుకూ ఇబ్బందీ లేకుండుటకు ఈ స్కూలు కొఱకు సువిశాలమైన పెద్ద భవనమొకటి మైసూరు ప్రభుత్వమువారు నిర్మించవలెనని తీర్మానము కోరుచున్నది.

ప్రాథమిక పాఠశాలలలో పురుషులనుగాక స్త్రీలనే ఉపాధ్యాయులుగా వేసుకొనుట మంచిదని థియొబాల్డ్ సతి తీర్మాన సారాంశము.

మైసూరులోని బాలికల వసతి గృహము స్థితిని బాగుగా అభివృద్ధి చేయవలసియున్నదనీ, యీ హాస్టలుయొక్క ప్రస్తుతస్థితి శోచనీయముగ నున్నదని తంగమ్మాళ్ తీర్మాన సారాంశము.

ఈ స్త్రీలసభాశాఖ ఎఫిలియేషను ఫీజును 1941 నుండి 10 రూపాయలనుండి 5 రూపాయిలకు తగ్గింపవలెనని లోకసేవాపరాయణి కె.డి. రుక్మిణియమ్మ కోరెను.

అంతేకాక, మైసూరు సంస్థాన స్త్రీల మహాసభ వార్షిక సమావేశమున హాజరగుటకు ఒక్కొక ప్రాంతమునుండి 12 గురు బదులు 8 గురు ప్రతినిధులైన చాలునని ఈమె ఒక తీర్మానము ప్రవేశపెట్టెను.

మైసూరు సంస్థాన స్త్రీల మహాసభ నిర్మాణ ప్రణాళికను సవరించుటకుగాను ఒక చిన్న ఉపసంఘమును నియమించుట అవసరమని ఒక శిఫార్సు.

స్త్రీలను కొందరిని పోలీసులుగా నియమించవలెనని ఈ సభవారు మైసూరు ప్రభుత్వమును కోరు చున్నారు. అవసరమయినప్పుడు స్త్రీ ఖయిదీలను తనిఖీచేయుటకును; స్త్రీ ఖయిదీలను అరెస్టయిన చోటు నుండి ఇంకొకఊరు జెయిలుకుగాని ఒకఊరు జెయిలునుండి ఇంకొకఊరు జెయిలుకుగాని దీర్ఘ రైల్వే ప్రయాణము చేయించునపుడు వారివెంట ఉండుటకును; నైతికప్రమాదములు రాగలచోట్ల స్త్రీల రక్షణ కొఱకును; స్త్రీ పోలీసులు అత్యవసరమని యీ తీర్మానము నచ్చచెప్పుచున్నది.

భార్యాభర్తలు కూడ ప్రభుత్వోద్యోగములలోనున్న సందర్భములలో డాక్టరు, టీచరు, నర్సు పనులు చేయుచున్న స్త్రీలను తమ భర్తలున్న ఊళ్లనుండి వేరుచేయరాదని ప్రభుత్వమువా రేర్పాటుచేయ గోరునది ఇంకొక తీర్మానము. ప్రస్తుతము ఈ ఉద్యోగులగు దంపతులను వేరుచేయుట ప్రమాదకారణముగ నున్నది.

ప్రస్తుతము మైసూరు నగరములో ఒక్కటే స్త్రీల హైస్కూలున్నందువలనను, దినదినమునకు విద్యార్థినుల సంఖ్య హెచ్చిపోవుచుండుటచే మైసూరులో ఇంకొక గరల్స్ హైస్కూలును కూడ పెట్టవలెనని ప్రభుత్వమును కోరుచు శ్రీమతి శారదా నంజుండయ్యసతి తీర్మానము నుపపాదించెను.

మైసూరు సంస్థాన ప్రాంతములోని అంధబాలికల విద్యకొఱకు ప్రభుత్వమువారు ఏర్పాటులు చేయవలసియున్నదనీ, ప్రస్తుతము అంధబాలురకొఱకు విద్యాసౌకర్యములు ఏర్పాటులు అత్యంత ప్రశంసార్హముగ చేయబడియున్నవనియు, మిస్ ఎల్. ఎమ్. స్టోన్ హెచ్చరించెను.

---

## బాపట్ల తాలూకా మూడవ మహిళాసభ

బాపట్లతాలూకా మహిళాసభ మూడవ సమావేశం బాపట్లలో అక్టోబరు 18వ తేదీని శ్రీమతి వి. విశాలాక్షమ్మగారు బి. ఎ. ఎల్ టి. అధ్యక్షతకింద జరిగినది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు సభా ప్రారంభోపన్యాసము చేసిరి.

బాపట్లలో, గుంటూరు జిల్లాబోర్డువారు బాలికలకు ఉన్నతపాఠశాలను త్వరలో నేర్పరుప వలెననియు, బాలికలకు హైస్కూలులో జీతములుండకూడదనియు, తలిదండ్రులు తమ బాలికలకు హిందీని నేర్పించవలెననియు, స్త్రీలకు ఆస్తిపై వారసత్వ హక్కులుండవలెననియు తీర్మానములు చేయబడినవి.

ఆంధ్రరాష్ట్రము విషయమై ప్రభుత్వమువారి వైఖరిని ఖండించుచు, త్వరలోనే, ఆంధ్రరాష్ట్ర మేర్పరుపవలెనని ప్రభుత్వమును కోరుచు, ఒకతీర్మానము గావింపబడినది.

---

## గ్రంథస్వీకారము

### ఖడ్గతిక్కన (పద్యకావ్యము)

శిరోమణి, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి విరచితము. ఆంధ్రకావ్యమాల, పుష్పము 6. వెల 8 అణాలు. శాస్త్రిగారికి, 44 జీరా; సికింద్రాబాదు (దక్కను)కు వ్రాసిన, పుస్తకములు దొరకును.

### భగ్నజీవి (శశిప్రేమలేఖలు పర్మ అంతిమజాబు)

సమీకరణ: నిర్మలాదేవి. ప్రచురణ: విజ్ఞానసాహిత్యవనం, గవర్నరుపేట, బెజవాడ. (ద్వితీయ కుసుమం) వెల రెండణాలు.




## కొచ్చిన్ సంస్థానంలో 'దేవదాసీ' పద్ధతి రద్దు

కొచ్చి సంస్థానంలోని తిరుమలదేవస్వోం దేవాలయములో చిరకాలానుగతముగా దేవదాసీలు నాట్యము చేయుచు పూజాగీతములు పాడుచు, దేవాలయమునకు యావజ్జీవము దత్తమై యుంటూఉండిన దురాచారమును నిలిపివేయుచు కొచ్చిన్ మహారాజావారు ఈమధ్యనే ఉత్తర్వులను ప్రకటించిరి. బాలికలను దేవదాసీలుగా సమర్పించే అవమానకరమగు పద్ధతిని మహారాజావారు నిషేధించిరి. దేవాలయములోని పూజాదికార్యములందును, ఉత్సవాదులన్నింటను ఇదివరకు దేవదాసీలు నాట్యము, గానము చేయుట అవసరమయిన అనుబంధముగ నుండెడిది. ఇప్పుడు ఈ దేవదాసీల ఆటపాటలు నిషేధింపబడినవి. అయితే దేవదాసీలకు నెలవారీగానో వార్షికముగానో సంస్థానమువారు ఇచ్చుచుండిన మామూలు ధనముమాత్రము వారికి యావజ్జీవము ఒసగబడుచునే యుండును. వారి జీవనాధారమునకు దెబ్బలేదు. సంఘ సంస్కరణ మార్గమున ధైర్యముతో కూడుకున్న యీ ప్రకటనకు పత్రికా ప్రపంచమును ప్రజలును చాలా సంతోషమును ప్రశంసను వెల్లడింతురు.

ఆత్మ వినాశమునకు, వ్యభిచార దుర్గతికి దారిచూపు "దేవదాసీ" పద్ధతిని నిర్మూలించుటకు ముందడుగువేసిన కొచ్చిన్ మహారాజావారికి మా హృదయపూర్వక అభివందనములను తెలుపుచున్నాము.

మదరాసు రాష్ట్రములోను అక్కడక్కడ అమలులో ఉన్న యీ దేవదాసీ దుష్టపద్ధతిని తొలగించుటకు ప్రభుత్వమువారు చట్టములు - శాసనములు చేయవలెనని శాసనసభద్వారాను, బహిరంగ సభలలో ఉపన్యాసములు వ్యాసములు మూలముగను అత్యధిక ఆందోళనము చేసియుండిన సంఘసంస్కరణ పరాయణి సేవా మార్గమున నాయకురాలునైన డాక్టరు శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారి ప్రయత్నములు ఉద్యమము ఇంకను సఫలము కావలసియున్నవి. మదరాసు ప్రభుత్వమువారు ఇందుగూర్చి శ్రద్ధబూనుదురని ఆశింతము.

## వ్యభిచారవృత్తి నిర్మూలనోద్యమము

మదరాసు విజిలెన్సు ఎసోసియేషనువారి తరఫున, స్త్రీల క్షేమరక్షణములకై పనిచేయుచున్న శ్రీమతి వి. టి. లక్ష్మిగారు, ఎం. ఏ., ఎల్. టి. ఈమధ్య కృష్ణాజిల్లాలో సంచారప్రచారములుచేసిన సంగతి వార్తాపత్రికలలో పడినది.

ఈమె పెక్కుసంస్థలను ఉద్యోగులను చూచి, తమ ఉద్యమముగూర్చి ఉపన్యాసములు చేసిరి. అందరూ తమ ఉద్యమమునకు తోడ్పడవలెనని హెచ్చరించిరి.

మద్రాసురాష్ట్ర వ్యభిచారనిరోధచట్టముయొక్క ప్రాముఖ్యతనుగూర్చి యీమె విపులముగా ప్రసంగించిరి. వ్యభిచారవృత్తికి లోనైన దుఃస్థితిలోయుండు స్త్రీలను రక్షించుటయు, వారి జీవితముల సక్రమ పద్ధతులలో పెట్టవలసిన అవసరమును, ప్రతి మానవుని విధియైయున్నదని ఈమె హెచ్చరించిరి.

వ్యభిచారవృత్తి నిర్మూలనమునకైయే మద్రాసు విజిలెన్సు సంఘము స్థాపింపబడినదనియు, స్త్రీసదనమను సెంట్రల్ రెస్క్యూ హోము నెలకొల్పబడినదనియు, అనేకవిధముల ఎంతెంతమందియో స్త్రీల మానరక్షణకీ సంస్థ తోడ్పడుచున్నదని వివరించిరి. బ్రోథెల్సు చట్టము సుమారు 35 పురపాలక సంఘములలోను 25 పంచాయతీలలోను అమలుజరుపబడినదనియు, అచ్చటచ్చట స్త్రీసదన రెస్క్యూ హోము (రక్షణాలయం) శాఖలు స్థాపింపబడినవనియు, యిట్టి బ్రాంచీలు అన్ని పట్టణములలోను ఏర్పాటు చేయవలెననియు, యిందుకు పురపాలక సంఘములవారును పౌరులునుకూడ సహాయముచేయవలెనని కోరిరి.

మదరాసు స్త్రీసదన రెస్క్యూహోమువారి కృషిఫలితముగ, మదరాసు నగరములో అదివరకు ఉండిన వ్యభిచార గృహాల సంఖ్య 3000 నుండి సుమారు 360 వరకు తగ్గింపబడినదనియు, 1937-వ సంవత్సరమునుండి 1941 వరకు సుమారు 800 మంది బాలికలు రక్షింపబడిరనియు ఈమె తెలియజేసిరి. ఈ రక్షింపబడినవారికి విద్యగరపి, వారిని మంత్రసానులుగను, నర్సులు మొదలగువారినిగను, తయారుచేయడమయినదని చెప్పిరి.

ఈ ఉద్యమము పతితపావనోద్యమమనియు, సంఘ పారిశుద్ధ్యమునకు జీవిత పవిత్రతకు ఎంతయు అవసరమయినదనియు, ఇందు ఐహికాముష్మిక పరమ ప్రయోజనములున్నవనియు వివేకవంతులకు వేరే చెప్పనక్కరలేదు.

ప్రగతిశీలమగు సంఘోద్ధరణసేవా కార్యకలాపమందు పడుపువృత్తి నిర్మూలనోద్యమము శ్రేష్ఠతరమైనది, బాధ్యతతో కూడుకొన్నది. ఈ రాజధానియందును, ముఖ్యముగ ఆంధ్రదేశమందును ఈ ఉద్యమము సార్థకము సఫలము నగుగాకయని కోరెదము.



Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.